శ్రీ

# కాటమరాజు



గ్రంథకర్త:

పట్నాల సుబ్బారావు.

శ్రీ రాధాకృష్ణాయనమః

# శ్రీ
# కాటమరాజు

ప్రకాశకులు:

1. తాడిబోయిన శివరామయ్య
2. మైల లింగయ్య
3. వుగ్గం నాగేశ్వరరావు


విభవ చైత్ర

మొదటికూర్పు 1000 ప్రతులు.

తెనాలి శ్రీ రాధాకృష్ణ ముద్రాక్షరశాల యందు,
ముద్రింపఁబడెను.

1928




[వెల రు. 1—0—0.]

B

ఈ నా రచించిన "కా ట మ రా జు" అను రూపకమును ముద్రణాది
కారాది సర్వహక్కులు మ. రా. శ్రీ తాడిబోయిన శివరామయ్యగారు
[ఎడవూరు] మైల లింగయ్యగారు [పిడపాడు] వుగ్గం నాగేశ్వర
రావుగార్లు [ఎడవూరు] పొంది యున్నారు కావున

☞ ప్రకాశకుల అనుమతి లేనిది యీ నాటకము
ముద్రించుటకు వీలు లేదు.

ఇట్లు,
గ్రంథకర్త.
పట్నాల సుబ్బారావు.

# కృతి సమర్పణము

సీతారామ పదాశ్రయ
బేతాళ పిశాచ భూత * భీకర కాయా!
భీతావన ధీరేయా!
సీతానగ రాంజనేయ! * శ్రితజన గేయా!

వీనుల విందుగా కవులు * విన్నరి, వింటిని, శ్రావ్యకావ్య సం
తానము, దృశ్యకావ్యమిది * నా ప్రియపుత్రి, భగవత్ప్రాజ్ఞసే
వానిరతిన్ ఘటించి, కను * పండువు సేయగ నేగుదెంచె, సీ
తానగ రాంజనేయ ప్రమ * దంబున గాంచి యనుగ్రహింపుమా

"సౌభాగ్య సంశ్రీయ సంసిద్ధి యొ * దవకున్న
సుకృత సంలబ్ధములు న * య్యు శోభగనవు
కవితలును, గానములు, * శిల్పకళల" టందురి
యున్నత దాక్షిణ్యమున, కా * వ్య మొప్పగాత,

2. గ్రంధకర్త,         1, 3, 4, ప్రకాశకులు.         [ యమవంశ క్షత్రియులు ]



1 టి శివరామయ్య,   2 పి సుబ్బారావు,   3 యం. లింగయ్య   4 వి. నాగేశ్వరరావు.

# పీఠిక

వేదయుగమునుండియు యాదవులు గోపాలనము ప్రధానధర్మముగా ననుష్ఠించుచుండి నటులు పురాణప్రసిద్ధము. యాదవుల మూలపురుషుడగు యదుమహారాజు స్వసంఘీయులగు నార్యుల లాభక్షేమములకై పశుపాలన మారంభించి తత్ క్షేమనిరోధకులగు వారినడ్డగించి యనేకపర్యాయములు యుద్ధములొనర్చినటులు చరిత్రలవలన దెలియ వచ్చుచున్నది. అట్టిమహామహునిసంతతిలో ప్రతిభావంతులగు వీరపుంగవులనేకులీ భారతావనియందు బలుతావుల స్వతంత్ర రాజ్యములను స్థాపించుకొని ప్రధానధర్మమగు గోపాలనము ముఖ్యవృత్తిగా బరిపాలించుచుండిరి. వారలలో నీ నాటకమునందలి కథానాయకుడగు కాటమ రాజు యొక్క పూర్వులునొక్కరైయుండిరి. ఈ కథానాయకుని పితామహుడగు నలురాజు ఎలమంచి, పంపాద్రి, మొదలగు పట్టణములను (గోరక్షణముతో బాటు) బాలించినటుల పూర్వకవికృత వలురాజుచరిత్ర పంపాద్రినామముల (అముద్రిత ద్విపదగ్రంథములు) ను వానివలన దెలియుచున్నది. ఈ కథానాయకుడు తన చరమదశయందు నెల్లూరు ప్రభువును, కాకతీయక్షత్రియోత్తమునగు మనుమసిద్ధిరాజుతో జేసిన యుద్ధకాలమును మ॥ రా॥ శ్రీ చిలుకూరి వీరభద్రరావుపంతులగారు తమ ఆంధ్రులచరిత్ర 2వ భాగము 2వ ప్రకరణమున క్రీ॥ శ॥ ౧౨౬౦ సం॥ మని నిర్ణయించియుండిరి. కాన నా కాలమునకు పూర్వము రెండు తరములక్రిందటనే అనగా నిప్పటికి షుమారు ౭౦౦ సం॥ నాటి ప్రభువుల చరిత్రములు ముద్రితములు కాకుండుట విషాదకరము.

అట్టివే మఱియెన్నియేని పూర్వగాథలు విస్మృతములై యుండినవి ఆ కాలపు యాదవ వీరుల బల పరాక్రమాదులను దెలుపు చారిత్రకములలో నొండు రెండుగాక మిగిలిన వన్నియు, నముద్రితములగుటవలన వారలను గుఱించి తెలిసికొనుటకు పాఠకమహాశయులకెట్టి యాధారములు గన్పించుటలేదు. కథానాయకుడగు కాటమరాజు విష్ణ్వంశ సంభూతుడు గను తదనుచరులగు గోపాలకులు దత్పాలితములగు ధేనువులు, దేవాంశసంభవములు గను వాకొనబడుటనుజూడ ద్వాపరయుగమందీజాతీయులయందావహించినమహాద్విషయమింకను బరిమళించుచునే యున్నదని, చదువరు లెఱుంగక పోరు. శమదమాది సాత్విక గుణములు బలవీర్యాది క్షాత్రగుణములచే విరాజిల్లు యదుపుంగవుల చరిత్రములు పైనదెలిపినటుల ద్విపదమయములగుట నిక్కాలపువారి నంతగా నాకర్షింపజాలక పోవచ్చును.

నిర్మల వర్తనుల జీవితవిశేషముల నెల్లరు నవలోకనమొనర్చుట బాడిగాన నట్టియుద్దేశ్యముతో నీ (కాటమరాజు) గ్రంథకర్తయగు మ॥ రా॥ శ్రీ పట్నాల సుబ్బారావుగారు మూల గ్రంథమునుండి కథాంశమును గైకొని ఇక్కాలమునకు దగినటుల నీ నాటకరూప

మున రచించి పాఠకుల మన్ననలకు పాత్రులైరి. ఈ గ్రంథమందలి గుణదోషముల విమర్శన పాఠకులకే వదలి ఇట్టి యపరిచిత గ్రంథముల మరికొన్నింటి రచించి లోకోపకారమొనర్చ గ్రంథకర్తగారిని వేడుచున్నాను. ఈ గ్రంథ ప్రకాశకులగు మ॥ రా॥ శ్రీ తాడిబోయిన శివరామయ్య, మైల లింగయ్య, వృగ్గం నాగేశ్వరరావు గార్లు పిన్నవయస్కులయ్యును గ్రంథరచనకొఱకు గ్రంథకర్తగారిని ప్రోత్సాహపరచుటయుం దేమి, గ్రంథమును ముద్రణ సేయించి వెలువరించుటయుం దేమి, కలిగిన వ్యయ ప్రయాసలను పాటింపక సఫలీకృత మనోరథులైనందులకు వారలనభినందించుచు, నిట్టియత్నములను బెక్కింటి నాచరించుటకు ప్రకాశకులను శ్రీ రాధాకృష్ణులనుగ్రహించుగాక యని నమ్ముచు విరమించుచున్నాను

యడవూరు,
10—4—28.

ఇట్లు, బుధజన విధేయుడు,

ఆరాధ్యుల పిచ్చయ్య

# విజ్ఞప్తి

నా రచించిన గ్రంథములలోనిదియే ప్రథమ ముద్రితము. మిత్రులగు మహారాజశ్రీ తాడిబోయిన శివరామయ్యగారును (ఎడవూరు) మైల లింగయ్యగారును (పినపాడు) వృగ్గం నాగేశ్వరరావుగారును (ఎడవూరు) సీ కాటమరాజు చరిత్రమును నాటకరూపకముగా రచించు భారము నాతలపై నుంచుటయు నేనును తత్ పవిత్ర విశ్వాసమెయిద్దానిని పూర్తింపగలదను నమ్మకమున నాయసమర్థతనైనను గణింపక నియ్యకొని తత్ కథాంశము నుగైకొని నీరూపకమును పూర్తించితిని. కవిసమాజంబులగు నెరసులింకెవ్వేనిదొరలినకృతజ్ఞులు మన్నింతురు గాక.

విధేయుడు,
కట్నాల సుబ్బారావు.

# ఇందు వచ్చు పాత్రలు

## పురుష పాత్రలు

| | |
|---|---|
| పెద్దిరాజు | యెలమంచిలి ప్రభువు (యాదవరాజు) |
| సింహాద్రి | పెద్దిరాజగ్రజుడు |
| యెఱనూకరాజు<br>నలనూకరాజు<br>పోలురాజు | పెద్దిరాజు సోదరులు |
| పల్లికొండ రఘుపతి | పెద్దిరాజు మంత్రి |
| గంగురాజు | కళ్యాణపురాధిపతి |
| నాగశర్మ<br>వల్లభయ్య<br>పోతురాజు<br>ఆంజనేయరాజు<br>పుత్తమనాయడు | గంగురాజునకు సహాయులు |
| వృద్ధకంచుకి | పరిచారకుడు |
| కాటమ రాజు | పెద్దిరాజు కుమారుడు |
| వాలకేతుడు | ఆన్లపెంట పురాధిపతి |
| శేషాద్రిరాజు | మదనకుంభీశులరాజు |
| మణిగ్రీవుడు<br>చిత్రవర్ణుడు | కిన్నరులు |
| నందుడు<br>గోపుడు<br>సునందుడు<br>సుందుడు | గోపాలురు |
| కరండకుడు — | యుద్ధవార్తాహరుడు |
| పేరిశాస్త్రి<br>రామశాస్త్రి | బ్రాహ్మణులు |
| బత్తిగన్న | పోలురాజు కుమారుడు |

## స్త్రీ పాత్రలు.

| | |
|---|---|
| పెద్దమాదేవి — | పెద్దిరాజు భార్య |
| పాపమాంబ — | పెద్దిరాజు కుమారిత |
| సుబ్బలక్ష్మమ్మ<br>రామలక్ష్మమ్మ | మూసివాయనపు పేరంటాండ్రు |

☞ సందర్భానుసారముగా స్త్రీ పురుష పాత్రలు వచ్చుచుండును.



H

ఓమ్

శ్రీ సీతానగరాంజనేయాయనమః





# కాటమరాజు

## ప్రథమాంకము

---

### నాంది

---

ఉ॥ శ్రీ సచరాచరాశ్రయ ధ * రిత్రిని, నేగన, నెట్టిప్రాణికే
యేసమయంబులం దనున * యించునొ, యట్టిక్రియల్ దనంత దా
నై సమకూర్చు కృష్ణహర * మూర్తి సమస్త పురోభివృద్ధులన్
భాసిలనే లుంగాత యుద * నంశము నాశశితారకంబునన్.

[ తెర లో ]

నిజము నాందిపాఠకా! నిజము !!

నాం॥ పా॥ — (వినుట నభినయించి) అదిగో! మహారాజుగారలు దెంచుచున్నారు

(నిష్క్రమించును.)



శ్రీ

# కాటమరాజు.

## ప్రథమాంకము.

### 1 వ రంగము—రాజమందిరము.

[పెద్దిరాజు పూర్వోక్తవచనమున ప్రవేశించుచు.]

నిజము - నాందిపాఠకా! నిజము - యేమంటివి ?

ఉ॥ ........................యేదశ నెట్టిప్రాణికే
యే సమయంబులం దనున కీయుంచునో, యట్టిక్రియల్ దనంత దా
నై సమకూర్చు కృష్ణపరమాత్మ..................

అనిగదా? అవును! లేకున్న సంతాన నిర్భాగ్యుండనగు నన్ను నిర్నిమిత్త కారుణ్యంబున, నిట్లు కళ్యాణయాత్రకుఁ బురికొల్పునా? యేమి! ఆమనోహర విగ్రహము! యేమి ఆతేజస్సు!! అట్టె కనబడినవాఁడట్టె మాయమయ్యె... వెంట బడితిని......అడియాస! ...దౌర్భాగ్యులకు దైవసందర్శనములుకూడా లభించునా? ......యెక్కడి కళ్యాణయాత్ర! అలంఘ్యమును, ననివార్యమును నగు మత్పితృదత్త రాజ్యపాలనాపాశబద్ధుండనగు నే నెక్కడ!! అందు బహుదినప్రయాణమ్మును, దుర్గమ మహారణ్య ప్రదేశంబులఁ దాటి, దేశమ్ములు గాని దేశమ్ములకు...యెట్లేగుట. అసంఖ్యాకులగు మత్సహోదర సుహృద్బాంధవ ప్రజలిందుల కియ్యకొందురా! ఇయ్యది యెంతమాత్రము పొసంగదు (ఆలోచించి) అట్లని యీ యాత్రవిరమించుకొనిన నెట్లు?

ఉ॥ సూనులులేరటంచు వగ ౯ స్రుక్కు మమ్ముఁ దయ్యెఁ దనంతటన్
దానయివచ్చి సంతసిడి ౯ దప్పుడు దంపతులీరుకూడి క
ళ్యాణపురీవరంబునకు ౯ రండదు నీశ్వరు నాజ్ఞలం దెవం
డేని యవజ్ఞ సల్పగల ౯ డే! సిరి రాము కాలుజాతు రే!

కావున నిద్ద్యాది తప్పదు. యెట్లయినను వెళ్ళి రావలయును. ఇందు మత్ప్రాణేశ్వరి యభిప్రాయమ్మును గనుంగొని, తదనుకూల ప్రయత్నంబులలో నుందుగాక...

[నిష్క్రమించును]



2 వ రంగము — పూజామందిరము.

[పెద్దిరాజు ప్రవేశించి, దీక్షాబద్ధయై పైటచెఱంగుపై నిద్రించుచున్న పెద్దమాదేవినిజూచి, సకరుణముగా]

ఆహా! సంతానాపేక్ష యెట్టికష్టంబుల కోర్పింపదు! అందు పాపము, స్త్రీ జనంబులకు సంతానవిరహమునకన్న దుఃఖహేతువీజగంబున మఱొండు గనఁబడదు.

గీ॥ కడుఁదరిద్ర పరంపర కలచుచున్న
దుర్వ్యాధి దురాగ్రహంబునఁ గ్రాఁకుచున్న
పడతి సంతానమునకునై పాటుపడెడు
"కొడుకు మోహనయంత్రమీ కోమలులకు"

ఎందుకు! ఇదియే! (పెద్దమాదేవివైపు చూ[illegible]ంచుకొ ప్రత్యక్షము. మృదులము లగు హంసతూలికా తల్పములపై శయనించు మహా[illegible]తనియమాదులచే నీకఱకు రాళ్ళపై పైటచెఱంగుఁబఱచి నిద్రించుచున్నది. ఏమని [illegible] బిడసంతానవాంఛఁజూచిన, సమదుఃఖభాగినగు నాకే జాలియయ్యెడు [illegible] వ్రతమాచరింపుమన్నను నెవ్వతే ధర్మములజేయుమన్నను, నెవ్వరే పుణ్యతీర్థంబులందోఁగుడన్నను, నెవ్వరేయాత్రల సేవింపుడన్నను ధనవ్యయంబునకుం జంకదు. స్వశరీరకష్టంబులకేని శంకింపదు. ఉపవాసజాగరణాదులచే నెంత కృశించిపోవుచున్నదో! ఈ మధ్య మఱింత పిచ్చిదియై పోయినది. యెంత చెప్పిన నూఱటఁజెందదు. చెట్టున పండిన పండ్లా! కోసికోనుటకు భగవత్సంకల్పము లెట్లున్నవో? ఇదిగో! యీ కళ్యాణ యాత్రాఫలితంబునుకూడ జూచుకొని యీపాప భూయిష్టమగు తనువును విడచుట శ్రేయస్కరమని తోఁచెడును. లేకున్న నెవ్వరీ దుఃఖము భరింపగలరు?

పెద్దమాదేవి—(లేచి కలవరపాటుతో కండ్లు తుడుచుకొనుచుండును.)

పెద్దిరాజు—(పెద్దమాంబను చేతితో దట్టుచు) దేవీ! యేమట్లు కలవరపడుచుంటివి! యేదేని భయప్రదమగు కలవచ్చినదా యేమి!

పెద్దమా—(ఆత్రముతో) నాథా! మీరెంత నేపైనదివచ్చి, ఆదివ్యమంగళ విగ్రహమును మీఱు చూచితిరా! సచ్చిదానందమూర్తి కళ్యాణేశ్వరుండికే గదా వెళ్ళె - మీ ముందుగానే... మీఱు చూడలేదా? (ముందుకు పరువెత్తుచున్నది.)

పెద్ది— (చేయిపట్టుకొని) సఖీ! యేమీ! కలువరించుచుంటివా?

పెద్దమా—కలువరించుట లేదండి...నిజము, ఆ మహామహుని, నేను కండ్లారజూచి తిని. రాత్రియంతయు నీతని చిత్రచర్యలఁ జూచుటయందే తెల్లవారినది.

పెద్ది— దేవీ! అవును. కలలన్నియు సహజముగా నట్టివేయైయుండును!

పెద్దమా—లేదు! నాథా! అన్నియు బ్రత్యక్షములే! కలలో జరిగిన మఱేది యసత్యమైనను, నేనా తేజోమూర్తిని మాత్రము గండ్లార జూచితిని,...

పెద్ది— ఏమి! దేవీ! నీ మాటలు మఱింత చిత్రములు. స్వప్నవిషయమ్ములు కొన్ని యసత్యములునుఁ గొన్ని సత్యములునా! అయిన, నా స్వప్న మెట్టిదో జ్ఞాపకమున్నదా!

పెద్దమా—జాగ్రదవస్థయందుఁ జూచినట్లును, విన్నట్లును, స్ఫురించుచున్నది...నాథా! రాత్రిమనము వ్రతమును పూర్తించి మీరిట్లు వెళ్ళితిరా, తరువాత భగవ ద్ధ్యానము చేసికొనుచు, కొంతసేపటికి నిద్రవచ్చి పైటచెఱంగున జేర బడితిని, అంత...యేమనిచెప్పుదు! సూడిదిగానున్న మన కపిలావీని నదట...నాథా! యేమి! ఆ దూడ సౌకుమార్యము...ఆ సౌందర్యము, ముగ్ధులమూటగట్టుచున్నది.

పెద్ది— దేవీ! ఇప్పుడే నీ వింత మఱచియుచుంటివి! కలలో నా దూడను జూచినప్పుడెంతగా మఱచియుంటివోకదా! తఱువాత!

పెద్దమా—నాథా! తఱువాత, యా గోవు తన ముద్దుబిడ్డను తడియార్చి, పాలు గుడుప వచ్చినది. [యులికిపడును]

పెద్ది— (సంభ్రమముతో) యేమట్లు విహ్వలవైతివి.

పెద్దమా—(చింతాక్రాంతయై) యేమియులేదు. ఆట్లాయావు చన్నుచేపినను, పాలు కుడువక, యా దూడ తల్లి మోముంజూచి [సంశయించుచు]

పెద్ది— దేవీ! యేమి! సంశయించెదవు, చెప్పుము.

పెద్దమా—(పొర్లివచ్చు దుఃఖమును నాపుకొనుచు) నాథా! పశుపక్షి క్రిమికీటకాదు లచే సహితమిట్లాక్షేపించఁబడుచు నెంతకాల మీ దౌర్భాగ్యపుం జీవితమును గడుపవలసియున్నదో కదా?

పెద్ది— ప్రాణేశ్వరీ! నీకీ వింతయగు చింతకేమి కారణము!

పెద్దమా—నాథా! యేమిచెప్పుదును! అట్లా యావుడూడ తల్లి మొగముఁజూచి,

గీ॥ "సంతులేని గృహస్థుల సౌధములను,
కసవుమెసవితి పందుచేఁ గలుషితంబు
లయ్యె; నీదుగ్ధములు నగ్రా హ్యములు, దీన,
మున్నుగల పుణ్యములుగూడ మన్నుగలసె."

పెద్ది— (చింతాక్రాంతుండై) హా! పరమేశ్వరా! (తలవంచి మౌనముద్రితుఁడై, కొంతవడికి లేచి) దేవీ! ఇయ్యది నీకు మాత్రమే దుఃఖకారణము కాదు. తరువాత మరేమి చెప్పినది!

పెద్దమా—నాథా! అంతటితో నూరుకొనక యాదూడ తల్లిని. "అమ్మా" యని సంబోధించుచు

సీ॥ "కష్టపరంపరా క్రాంత సంసారాబ్ధిఁ
దఱియింప కొమరుఁడే తరణి సముఁడు
దుర్భర దారిద్ర్య దుర్గమారణ్యంబు
దహియింప గొమరుఁడే దహనసముఁడు
నిజవంశ నిర్మల నీరకాసారమ్ము
నలరింపఁ గొమరుఁడే జలజ సముఁడు
ప్రాకృత పాపక ర్మక్షోణి ధరముల
బడనేయఁ గొమరుఁడే వజ్రసముఁడు

గీ॥ సమధిక సుశీల సద్యశ స్స్వరూపైన,
కొమరు లుండిననేగాని, యమరులతిధు
లర్చనల ధర్మములఁదృప్తి నందఁబోరు
సుతులు లేనట్టివారికి గతులు లేవు

యెన్ని సంపదలున్నను నెట్టి తపంబులాచరించినను నెంతటి సద్ధర్మాచరణ పరాయణుండైనను, గృహస్థుండు గోత్రపవిత్రుండగు పుత్రుం గాంచమి, నిహపరంబులను వ్యర్థుండగు, నిందుచే బితృపితామహాదులును పుణ్యలోకములనుండి యధఃపతితులయ్యెదరు" అని......

పెద్ది— (దుఃఖమున) హా! పరమేశ్వరా! యేమీ! ఈ దురంతము! నీచాతి నీచమగు నీజన్మ నాకేల నొసంగితివి!! నేనీయప్రతిష్ఠ నెట్లు భరింపగలను నే నెట్లీ పాపభూయిష్టమగు తనువును మోయగలను!!! (పితృదేవతల నుద్దేశించి) ఓ పితృదేవతలారా! దుర్మార్గులసంపర్కము లూఱకపోవునా! నిర్మలధర్మాచరణపరాయణులరై, తపోధనులరై, సద్యశోదిగంత విభ్రాజమానులరైన, మీకా! యధఃపతనము! నామూలమున, హా! హతోస్మి! హతోస్మి!

గీ॥ నే యఘంబు లెఱుంగని ఓ మీాయనూన
సద్గతుల కంతరాయంబు ఓ సలిపినట్టి
యీానృశంసుని నీభ్రష్టు ఓ నీ యభాగ్య
భంగ భరితునిఁ, జావఁ ది ఓ ట్టంగ లేరె!

పెద్దమా—నాధా! ఊరడిల్లుడు!!...అట్టులా దూడపలికిన, నయ్యావు పొంగిపొరలి వచ్చు దుఃఖంబును నడంచుకొనుచు, బిడ్డనుజూచి, "బిడ్డా! నా యీ దోషంబెట్లు పరిహరింపంబడు" నని, ప్రశ్నించెను.

పెద్ది— (ఆత్రముతో) అందులకేమన్నది!

పెద్దమా—ఆదూడి తల్లింజూచి "అమ్మా కాశీ, గయా కళ్యాణాది పుణ్యక్షేత్రమ్ముల సేవింపుచు, పుణ్యతీర్ధంబులందోగుచు, భూప్రదక్షిణముఁజేసిన నిష్పాప మడంగి, సద్గతులంగాంచగలవు-?-" అని చెప్పుచు, అదేమి మాయయో కాని! నాధా! ఆదూడ యట్టె మాయమై యొక తేజోమూర్తి యచ్చట నుట్టిపడియె! అంత నా యావామూర్తికిం బ్రదక్షిణ మాచరింనుచుండు టయునేఁ జూచి, పరమానందాశ్చర్య మగ్నమై యమ్మంగళవిగ్రహు నారాధించితినటు!

పెద్ది— (ఆత్రముతో) దేవీ! తఱువాత! తఱువాత!!

పెద్దమా—ప్రాణేశ్వరా! అంత నద్దేవదేవుండు నన్నాశీర్వదింపుమ, తాను "కళ్యాణ పరమేశ్వరుండ"ననియు, "మీదంపతులు మీ ధన కనకవస్తు వాహన పశు సముదాయంబులతోఁ గళ్యాణ పురమ్మున కరుదెండ"నియు, "సంప్రాప్తాభీష్టులయ్యెదర" నియు, నాజ్ఞాపించి యంతర్హితుండయ్యె!

పెద్ది— (స్వగతము) లోకంబున, జాగ్రదవస్థయందు గలిగిన, తలంపులె సుషుప్త్యవస్థయందు స్వప్నరూపము వహించునని, చెప్పుదురు...అదెట్లున్నను, నొక్క విషయమొక్క రాత్రి నిరువురి కలలయందిట్లు గోచరించుట దుర్ఘటము ఇందుమూలమున నిందెద్దియేని సత్యముండునని వాంఛ జనించెడు — (ప్రకాశముగా) దేవీ! ధన్యురాలవు! కరుణాంతఃకరణుండగు నప్పరమేశ్వరుండిట్లు ప్రేరేచుట మనపురాకృత సుకృతమ్ము కాదే!— —

యేది యెట్లయినను, ముందు, కళ్యాణేశ్వరుని యాజ్ఞలవశ్యాచరణీయమ్ములు.

గీ॥ అఖిల విశ్వప్రకాశుండు నఘ విదూరుఁ
డవ్యయానందమూర్తి కళ్యాణమూర్తి,
ప్రమథగణ సేవితుండయి, బరగు చుండ
గనుల జూచుటకంటె భాగ్యంబు కలదె!

పెద్దమా— మనోహరా! ధన్యురాలను! మీయాజ్ఞలనుల్లంఘ్యములు. (సంతోషపడు చున్నది)

పెద్ది— నెచ్చెలీ! నీకుంగల యీ యనపత్యాతురతం గనిన వింతయగుచున్నది.

పెద్దమా— నాధా! కళ్యాణపరమేశ్వరుని యనుగ్రహమున నట్టిభాగ్యమే లభించిన, నెవ్వరి కానందముకాదు! చూడుడు!!

సీ॥ చిరునవ్వు మొలకల చే ముద్దుఁగొలికెడు
సుతుమోము గండ్లాఱ జూచు కొనుచు,
తియ్యని తేనె జొత్తిలు బిడ్డపలుకులఁ
వీనుల విందుగాఁ బూని వినుచు
చినచిన్న యడుగుల చేఁ జుట్టి నడచెడు
నాత్మజుతో నాట లాడు కొనుచు
గూడి,పయ్యెదను దాగుచు మూతలాడెడు
కొడుకును కౌగిటఁ గుప్పు కొనుచు

గీ॥ రావె, నా తండ్రి! నా కూన రావె! నాదు
ప్రాక్భవానర్ఘ పుణ్య సత్ఫలమ, రావె!
యనుచు, నెత్తుకొనుచు, ముద్దులాడు కొనుచు
నెవ్వ రానందమున, సుఖయింప కుంద్రు!

పెద్ది.— దేవీ! కళ్యాణపరమేశ్వరు కరుణఁగలిగిన మనమును నట్టి యానందమనుభ వింపఁ గలము...చింతలుడిగి, ప్రయాణమ్మున కన్నియు నాయితపఱుపుము నేనునుఁ జని, ఘరుజనామోదముుఁ బడసి నిన్నుఁ గలసికొందు...

[నిష్క్రమించుచున్నాడు]

పెద్దమా—(భగవంతునుద్దేశించి) హా! స్వామీ! కళ్యాణేశ్వరా!

గీ॥ అతులితానందమయము, బ్రహ్మాది విబుధ
సేవ్యము, సమస్త కలుష విచ్ఛేదమైన,
పరమ కళ్యాణ మూర్తి? నీ పాదసేవ,
నోచినారము! యెంత ధన్యులమొ, మేము!

తండ్రీ! నీ సంఘటనము లెంతటి దుర్బోధములు, కలలోనైనం దలంపని నీ కళ్యాణక్షేత్ర యాత్రాగమనమ్ము నెంతలో సిద్ధింపఁ జేసితివి! స్వామీ! నీ చర్యలనూహ్యంబులు ... అతీతమ్ములు... అమూల్యమ్ములు! తండ్రీ! ధన్యులము!! ధన్యులము!!! (ధ్యానము నభినయించి ఆత్మప్రదక్షిణ నమస్కారము లాచరించి)... (గవాక్షము వైపుజూచి) బాగుగా తెల్లవారి నట్లున్నది.

గీ॥ కలకలారావములు మిన్ను కలగునట్లు
మొఱసెడు శకుంత సంతతి యరుణ కిరణ
కాంతులయ్యావె! ఘోరణ గండ్లనుండి
ఘోకెదును నిద్రమేల్కొల్పు సుదతులట్లు

ఇంత, నేఁజని, ప్రాతఃకాలకార్యంబులం దీర్చుకొని మన్నాథుండు వచ్చు నంతలో బ్రయాణసన్నాహంబున, నుందుఁగాక...

[నిష్క్రమించును.]

---

3వ రంగము — సభాభవనము.

[సింహాద్రిరాజు, పెద్దిరాజు, పోలురాజు, యజనూకరాజు,
నలనూకరాజు, పల్లికొండ రఘుపతి, మఱికొందఱు
సభ్యులునాసీనులై యుందురు.]

[యవనిక యెత్తబడును]

పల్లికొండ రఘుపతి —

చ॥ కడుపునఁ గన్న బిడ్డల ప్రకారము కూరిమి నాదరించి యే
యిడుమల నందనీకఁ, బ్రజ లెంతయు సౌఖ్యపడంగ రాజ్యముల్
గడువఁడి నేలి శాశ్వతముగా గల కీర్తిఁ గడించి నావు నీ
యడకువ, నీ సగర్భుల మహాభుజశక్తికి, వన్నె వెట్టెడుల్

అట్టి నీ విప్పుడు ... యెక్కడ కళ్యాణపురము, ... యెక్కడమనము, యాత్రలకెక్కడైన, దేశములు తెగించి పోవుదురా! మామా!

సింహాద్రిరాజు — నాయనా! పెద్దిరాజా! ఏమి నీ తొందర, సంతానప్రాప్తికి, భగవత్కరుణయే ప్రధానమ్ము, సర్వాంతర్యామియగు నబ్భగవానుని యనుగ్రహంబునకన్ని పుణ్యక్షేత్రమ్ములొక్కటియే! ... సేవించినవి, పుణ్యక్షేత్రమ్ములు కావా! తమ్ముడా! యెందులకిట్లు చింతిల్లెదవు- చూడుము-

సీ॥ దశరథ భూపాలు దారత్ర యమ్మున
సంతానమిడి ధన్యు సలుపలేదె!
అమరలోక భ్రష్టుడగు మృకండునకును
సుతునిచ్చి సద్గతుల్ జూపలేదె!
ద్రౌణి శస్త్రాఘాత తను పరీక్షితుఁ గాచి
భరత వంశమ్ముఁ గాపాడలేదె!
తఱిగిన, సుతుమన్చి సిరియాళు నతిథుల
సేవింప సర్వాని జేయలేదె!

గీ॥ సుతులు, సుతులసి పొక్కు దం కె పతులు, పుడమి
నెందఱొందరు, సంతాన కె మంది సౌఖ్య
మందరా దేవదేవుద కె యా వితీర్ణి
నెల్లకాలంబు నొకరీతి కె నెట్టులుండు!

త్రిమూర్తుల యంశమ్మున వెలసిన, వన్నెలక్ష కవిలావులను, ధనకనక వస్తువాహనమ్ములను బూజ్యుండగు మనతండ్రి వలురాజు మంత్రపూత గంగాజలంబులచే బంధుమిత్రబుధజనంబుల మ్రోల నీ ధాత్రిని, నీకుఁ బట్టాభిషేకం బొనరించినది మొదలు నింతవరకు నేలోపంబులు రానీక సురక్షితంబుగా, రాజ్యపాలనంబుతో పాటు పితృవాక్యపరిపాలనంబును నొనరించితివి- అయ్యది నేడు దప్పెదవా?

పెద్ది.— అన్నయ్యా! మీ మాట కడ్డువచ్చినందులకు నన్ను క్షమింపుడు! ... భగవత్కైంకర్యమునకు లక్ష్యమే ప్రధానము. అట్టి లక్ష్యము కుదురుటకే కాశీ గయా కళ్యాణాది పుణ్యక్షేత్రమ్ములు వెలసియుండుట. భగవత్కైంకర్యమునకు, పరాభిప్రాయానుకూల గమన మగ్రాహ్యము- "ఆత్మబుద్ధి స్సుఖంచైవా" యను నార్యోక్తి ఇందు చింత్యము

ఉ॥ తమ్ములువీరు, మీఱు గుణ కె ధాములు, నగ్రజు, లేకమై సహా
యమ్మొనరింప నేటివర కె కయ్యవచించిన రీతినెల్ల సౌ
ఖ్యమ్ముల రాజ్యమేలితిసి, కె గణ్యతఁగంటని మీకతానసే
సిమ్మహి నింతకొంత, జన కె దే! శ్రమదీర్చు కొనంగ నీగతిన్

అట్లు విశ్రాంతి గోరువారికి, యాత్రలు సేవించుటయే ముఖ్యసాధనము... కావున, కళ్యాణయాత్రయందు గృతనిశ్చయుండనగు నన్నభ్యంతరపెట్ట కనుమతింపుడు- నేటినుండి, సంతానవంతుండగు తమ్ముండీ పోలురాజు రాజ్యపాలనా బాధ్యత వహించి మిమ్ము సేవింపుచు సంతోషపెట్టంగలఁడు.

పోలు— (పెద్దిరాజు నుద్దేశించి) అన్నయ్యా! పితృసములరగు మీఱు లేని యీ రాజ్యము మాకు మహారణ్యంబుగాకుండునా! - మిమ్ము విడచి మేమెట్లుండ గలము! మేమును మిమ్మనుసరించుట కనుజ్ఞదయ సేయుఁడు.

పెద్ది— తమ్ముడా! నీ భక్తి తాత్పర్యమ్ములకు నా మనంబెంతయు నానంద మందుచున్నది. కాని చూఁడు

ఉ॥ ఏడుతరంబులందునిచ్చి, యెంతేయు గోధన ధాన్య వృద్ధులన్
గూడి, సుఖంబుగాంచుచును గూర్మి బ్రజాహితబుద్ధి రాజ్యమున్
బాడిని నేలగల్గిన, నృపాల కుటుంబముఁ వేఱుజేసి నా
తోడనుఁ దోడుకొంచుఁ, జన దూరదె లోకము, రాజ్యమింతు నే!

అట్లు చేయుటెంతయు నప్రతిష్ఠాకరము. కావున కళ్యాణపుర పరమేశ్వరు నారాధించి, కృతార్థుండనై మిమ్ముచిరకాలంబునం గలిసికొందు. చింతఁదక్కి నన్ననుపుఁడు ! పోయివత్తు.

పల్లికొండ—(పెద్దిరాజు నుద్దేశించి) మామా ! మీ వియోగమ్మున, కోరువని కతంబున మీ సగర్భ్యులింతవట్టు ప్రార్థించిరి కాని, మీఅభిలషించిన, కార్యంబును విఘ్నపరుప నిందెవ్వరు, సాహసింతురు!......చిన్మయుండగు నాకళ్యాణేశ్వరుండట్లు ప్రేరేపించుటకు మఱింకే విశేషంబు లుండునో! యెవ్వ రెఱుంగఁ గలరు, చూడుడు—!

సీ॥ ప్రహ్లాదునకుఁ బడ రాని పాట్లనుగూర్చి
యల హిరణ్యకశిపు నడఁచి వైచె
శ్రీరాము వనవాసిఁ జేసియు, రావణా
ద్యసురలోకము నంత మందఁ జేసె
పాండవాజ్ఞాత ప్రవాసంబుఁ గల్పించి
కీచకాదులఁ బట్టి కీటడంచె
సత్యహరిశ్చంద్రు జండాలుఁ గొలిపించి
తులలేని సంపద లెలమి నొసగె

గీ॥ సుజనులకుఁ గష్టములఁగూర్పఁ జూచు టెల్ల
జగముల యరిష్టశమనమె, భగవదేచ్ఛ
ఈ చతుర్దశ భువన, రక్షాచణుం, డ
తండు, కల్పించునే, నిమిత్తంబు లేక—

సింహాద్రి—మామా ! రఘుపతీ ! తమ్ముని యభిలాషయే కానిమ్ము.

పల్లికొండ—భాగపరిష్కారముగదా! కావలసినది; అందేమియున్నది...(ఆలోచనగా) అవును...మామా ! మీ తండ్రియగు వలురాజుచే నరణమ్ముగా నొసంగబడిన

కొమరమ్మ ధనకనక వస్తు పశుజాలమ్ములు నాటినుండియు, సమిష్టియందే యుండి వృద్ధిజెందు చుండుటచే మీ యేవురతోపాటు, నామెకును సమ భాగంబొసంగుట న్యాయ్యమని, నాకుందోచుచున్నది—

పెద్ది— అందులకు సందేహమేమి! మామా!

ఉ॥ పుట్టినదాదిగా, నిముసమైనమున్ బెడబాయక, బుట్టినయింటివా
ఱెట్టిడుములైన, వారి శుభమే! దలపోయుచు, వారివృద్ధికే
చెట్టకునేన్ సహించుకొను, నై చెల్లెలిసొత్తు హరించుమన్నటయా
కట్టడి, కొందు సద్గతులు నై కల్గునె! కల్గునె గౌరవంబిలన్

కావున, నామెకివ్వగా మిగిలినదే భాగింపుడు;

పల్లికొండ—భాగించుట కేమున్నది. (తెరవంకజూచి) దేవలా! మన ఖజానాలో నున్న ధనకనక వస్తు సముదాయమ్ముల, నాయా యుద్యోగులకుం దెలిపి, యారు పెట్టెలయందు సమభాగములుగా నుంచి, యందు తనకిష్టమగు పెట్టెను తీసికొనవలసినదిగా, కొమరమ్మకుం దెల్పుము...మామా! ఇంక నేమున్నది- కవిలాపుల మందకదా! (జ్ఞప్తినభినయించి) మఱచితిని; అదెట్లు? వాని నెట్లు విడదీయగలము? ...విష్ణ్వంశమున, బొల్లావు పుట్టెననియు బ్రహ్మ యంశమ్మునం, బుల్లెద్దు పుట్టెననియు, నీశ్వరాంశంబున మచ్చల బసవదేవుడుద్భవించెననియు, జతుర్వేదంబులును, గామధేనువున్నూ పంచవర్ణంబుల గోవులయ్యెననియును, దిక్పాలురు గోపాలురై యేడు తరంబులనుండియు నయ్యాలమందల నభివృద్ధిం జేయుచుండిరనియు, నీ యాలమందలను విభజించిన వారితల వ్రక్కలగునని మన యదువంశలేఖనమ్ములు, వక్కాణించుచున్నవే అదెట్లు...(ఆలోచన నభినయించుచున్నాడు)

పెద్ది— అట్లయిన, నిందు భాగపరిష్కారమెట్లు!

పల్లికొండ—(తలయూచుచు) బాగుగానున్నది-మామా నాకిందొక్క యుపాయము తోచుచున్నది... యెట్లందువేని, భాగస్థులందఱు, స్నానసంధ్యా ధ్యానుష్ఠానంబుల శుచిర్భూతులై, మందకుంజని వేదయుక్తంబుగా, నగ్గోవులం బూజించి, చనుదెంచి, మన కొట్టంబునంగల, యారువాకిళుల మొగంబుల యందు వారివారి నామంబులను లిఖించియుంచుటయు, సాయంకాలము, తిఱిగి, వచ్చిన యాలమంద లెవరి తలవాకిళులం బోయినవి వారివిగా స్థిరపఱచుకొనుట యుక్తంబుగా తోచుచున్నది.

పెద్ది— (సంతృప్తి నభినయింపుచు) మామా! మహామంత్రివనుటకు, నిన్నే చెప్పవలయును,...మతి యెవ్వతి కీ యూహలుపోవును... బాగుగానున్నది... యెవతియదృష్టము వారిది, ఇంతకంటె నుపాయాంతర మేదియుఁ గన్పట్టుట లేదు.

సింహాద్రి—ఇందులకు మేమును, సమ్మతించితిమి!

[ తెర లో ]

చ॥ బరువుగ నుండెనంచు మన భాగములంగల నొక్కపెట్టినే
గరమనురక్తిఁ గొంచుఁ జని కాంచగఁ నందున, గంగబాలయై
సురుచిర రూప సంపదలఁ జూడగ నయ్యెడు, నీమెనెట్టులీ
ధరణి భరింప నేర్తు! గుణ! ధాములరన్నలుమీాఋ చెప్పరే!

పెద్ది—(వినుటనభినయించి) యెవరది; అమ్మాయి కోమరమ్మకాబోలు! (కోమరమ్మ నద్దేశించి) అమ్మాధన్యురాలవు... నీపూర్వజన్మపుణ్యంబునజేసి లభించిన, నీ గంగామహాదేవిని, నీ యిలవేల్పుగా పూజించు కొనుచుండుము...నీభాగమ్మునకేమి! మిగిలిన, మాభాగములలోనే నీకును సమభాగము నివ్వగలము- చింతింపకుము—తల్లీ! చింతింపకుము!!

యెఱ— (తనలో) సమిష్ఠిగానున్న నిక్కుటుంబ మిట్లు, విచ్ఛన్నమగుటదలంచి, కాబోలు; గంగామహాదేవియు కోమరమ్మంజేరినది... దీనినిబట్టి చూడగా మత్సహోదరులెల్లరు, నీయెలమంచిలి విడచి, తలకొకత్రోవను, చెల్లాచెదరైపోవుదురనియే సూచించుచున్నది...ఆహా! ఎంతలో నెంతమార్పు...అవును దైవ సంఘటనమునకెవ్వరు కర్తలు... (విచారము నభినయించును)

సింహాద్రి—(కోమరమ్మ నుద్దేశించి) అమ్మాయీ! చింతిల్లకు!

గీ॥ ధనకనక వస్తువాహనో ద్ధతి నొసంగి,
తండ్రి, వలురాజు నిన్నిల దనిపె నట్టి
యమ్మ! నీసొమ్ము హరియించి యప్రతిష్ఠ
బాల్పడరు! నీ సగర్భ్యులె ట్లప్పనైన,

పోలు— (కోమరమ్మ నుద్దేశించి) విచారపడకుము! తల్లీ! ఈ కరియావులవారింటం బుట్టిన పశువైనం దోబుట్టువుల సొమ్మపహరింపదలంపదు...

నలనాక — నిజము! తల్లీ! నిజము! ఇదియంతయు నెందులకు-అమ్మాయీ!

గీ॥ పుట్టినింటను, తోబుట్టు ై పెట్టివేళ,
బిట్టువగఁజెంది కంట నీ ై ర్వొట్టుకొనిన
నశుభమన్ని, భీతినందు నీ ై యున్నదమ్మ
లమ్మ! నీసొమ్ము హరియింప ై నరయఁ గలరె!

పెద్ది — (మంత్రినిజూచి) మామా! రఘుపతీ! మిగిలియున్న యైదుభాగములను నారుభాగములుగా విభజించి యమ్మాయికొసంగి, సంతృప్తిఁబఱపుము.

పల్లికొం — (చిత్తము ప్రొద్దు జూచి) అపరాహ్ణ మగుచున్నది... కావలసిన కార్యములు చాలకలవు.

పెద్ది — అవును, రేపే ప్రయాణము ముందు కార్యములకుఁ ద్వరపడవలయు.

[లేచుచున్నారు.]

[అవనిక పడును]

ఇది
శ్రీ సీతానగరాంజనేయ కరుణా కటాక్ష ప్రలబ్ధ కవితా
శిల్ప ప్రవీణ, పట్నాల వంశోద్భవ అన్నపూర్ణా
చిదంబరాచార్య జ్యేష్ఠ తనూభవ
సుబ్బరాయ నామధేయ
ప్రణీతంబైన
"కాటమరాజు"
అను
దృశ్యకావ్యంబునందు,
ప్రథమాంకము.
సంపూర్ణము.

---



శ్రీ

# కాటమరాజు.

## ద్వితీయాంకము.

### 1 వ రంగము — అరణ్యము.

[ప్రవేశము — వృద్ధకంచుకి]

సీ॥ అతిథి దేవ బ్రాహ్మణాభ్యాగతుల భక్తి
నర్చించి సంతృప్తి నందువాఁడు,
అభిమతంబు లెఱింగి, శుభపాలనంబున
బ్రజల బిడ్డల వోలె నరయువాఁడు,
అనిలోన నేఁ శరణన్న శాత్రవునైన,
గరుణార్ద్ర మనమునఁ గాచువాఁడు,
యాచకాశ్రిత సేవకానీకముల కెల్ల
నెలమిఁ గోరినదెల్ల నిచ్చువాఁడు,
గీ॥ మంచిగోనముల కెల్లను మనికిపట్టు,
పెద్దిభూపాలుఁ డీపట్ల పిన్నపెద్ద
బాదుగులఁ దమ్ము గుఱ్ఱాల బ్రజలఁ బాసి,
చనెను, కళ్యాణపురికి, నీశ్వరు భజింప—

సద్ధర్మాచరణ పరాయణులగు ప్రభువులచేఁ బరిపాలింపఁబడుటయు, రాష్ట్రప్రజల పుణ్యమే కదా! సేవకావృత్తినింద్యమేయైనను, సద్వాశ్రయ

సంపన్నులగు మాభోంట్లపట్లు, నయ్యది యసంద్యమే! పుణ్యాత్ముఁడా వలురాజు, తన పుత్రులతోపాటు, నన్ననుజూచి, మిక్కిలి ప్రేమతో, నాదరించె...నీ మహారాజున్నూ "పెద్దవాడననియు, గౌరముగా బ్రతికిన వాఁడ" నియు, ఎంచి తగిన పనులకే నియోగించుచుండును...ఇట్టి మహారణ్యములం దిటుగుట కష్టమైనను సుహృదయులగు నీ ప్రభువుల విడువ లేకగదా! వచ్చితిని. ఈ ముసలితనంబున, జన్మభూమి నాశ్రయించి వేళ కేవో, రెండు మెతుకులను దిని, పడియుండక, నీ యరణ్యభూములకు, వచ్చుటతప్పె. కరుణాంతఃకరణులగు ప్రభువులును, రావలదని, చెప్పిరి. కానీ! 'నామస్వాతిమాత్రము' "విశ్వాసద్రోహము" "ప్రభువులతోపాటు, కష్టసుఖముల ననుభవించుట సేవకుని విధ్యుక్తధర్మ"మని హెచ్చరించుటచే, నిట్లురాక తప్పినది కాదు,... నామాటకేమిగాని, పాపము పెద్దమాదేవినిజూచిన, గడుపు తలుగుకొనిపోవుచున్నది. యాత్రలు సేవించువారు మాత్రమెందరు బండ్లెక్కియు, శిబికలనారోహించియుఁ, జనుట లేదు; పోనీ! కొలదిదూరమే యనుకొందమా! యెక్కడి కళ్యాణముమార్గము సుగమంబనుకొందమా! కంటకశిలావృత దుర్గమారణ్యభూమి, కర్ణకఠోర భయంకర సింహశార్దూల రావంబుల కులుకుచు, కాళ్లీడ్చుకొనుచు- పాదమ్ములు గాయమ్ములువడ నిట్లు బాధపడుటకు వీటికేమి మంచుకొనిపోయినది - అందోళికల నెక్కుడని యెంత వేడుకొనినను, వినదయ్యెను,

సీ॥ ఎండ కన్నెఱుగని | యిల్లాలు నీ ప్రచం
డపు టెండలకుఁ గడు | నవయవలసె,
నడుగుల మడుగుల | నిడ నడచెడు తల్లి,
చెడుబమ్మ ముండ్లలో | నడువ వలసె,
నునుమెత్త పట్టు పా | న్పుల బండు మాయమ్మ
పలుగు ఱాసేలలఁ | బండ వలసె,
చిలుక పల్కుల కెంతొ | యులికెడు మారాణి,
యడవి మెకపు బొబ్బ | నడల వలసె,

గీ॥ తినుటకును కట్టుటకు దైవ ౯ మునిచి యుండ
సేవఁ జేయంగ నాబోటి ౯ సేవకాళి
వేనవేల్ కాచుకొని యుండ ౯ దీనవృత్తి
నిన్ని చెనుగులు గుమవంగ ౯ నేమి విధిగొ.

ఇన్ని కష్టములు పడినగాని, బిడ్డలు కలుగరు కాబోలు, యేమో! వీరి చాదస్తము, పోనీ వీరిచాదస్తమెట్లున్నను, సృష్టిస్థితిలయ కారణభూతుండగు నా భగవంతుని నేమందము...

గీ॥ పిడికెడన్నంబు నిడలేని, ౯ పేదవాని
గొంతుకకు జుట్టు వలదని ౯ గొట్టుకొననే,
బిడ్డలో బిడ్డలోయని ౯ బెగడు పడెదు
వీరి జెసనైనఁ జూడను ౯ వింతయేమొ.

అవును- ఇట్టి పరస్పరవిరుద్ధ సమ్మేళనమా తాతకు, మొదటినుండి యుఁ నలవాటే... దాతకు ధనలోపంబును, లోభికి లాభంబును, లావణ్యవతియగు సతికి, వికారమార్గవర్తుండగు భర్తను, గుణవంతుండగు భర్తకు గుణహీనయగు భార్యను, కల్పించు... అదియేమి పాపమోకాని, మంచికి చెడుగు వెంటనే సృజించియే యుండును. (సవితర్కముగా) లక్ష్యసాధాన్యమగు పుణ్యక్షేత్రమ్ము, లభీష్టప్రదమ్ములు కావనుట కెవ్వడు సాహసించును. పెద్దలందఱంత యవివేకులా! కాశీ గయాది పుణ్యక్షేత్రముల మాహాత్మ్యము లెన్ని వినుటలేదు ... పుణ్యదంపతులగు మా ప్రభువులును, నభీష్టావాప్తినందకపోరు! భగవంతు డనుగ్రహించుగాక, (వినుటనభినయించుచు) యెవరో పిలుచుచున్నట్లున్నారు!

[నిష్క్రమించును]

[దేవీసహితుండై పెద్దిరాజు విచారగ్రస్తుడగుచు, ప్రవేశించును]

పెద్ది— (విచారముతో) ప్రాణేశ్వరీ!

గీ॥ దేవతల, బ్రాహ్మణుల, భక్తిఁ ౯ దృప్తిపరచి,
చదువులకు దెల్వితేటలకు ౯ జాలియున్న

వసుధను, నరుండు, తన కెద్ది ప్రాప్తమెంతో
యంత కెక్కుఁడు రవ్వంత నందఁబోఁడు.

దైవ నిర్దిష్టమగు మనదౌర్భాగ్యమున కనుగుణ్యమ్ముగనె, మందముచ్చలును, ఈన కట్టని గొడ్డుబోతావులును, మనభాగమునకు వచ్చినవి, పూర్వకర్మ మెంత యనివార్యమో కదా!

పెద్దమా—నాథా! ఈ ధనకనక వస్తువాహన పశుజాలంబులకా! మీఱు చింతించునది.

పెద్ది— దేవీ! నే నందులకు జింతిల్లుటలేదు, కాని భగవంతుని మహేంద్రజాలమ్మున కాశ్చర్య పడుచుంటిని.

పెద్దమా—నాథా! ఇదియొక చిత్రమా? చూడుఁడు,

గీ॥ బ్రహ్మమాయను, మునిగి క న్పడకయున్న
గోవులను, దూడలను, గోప గోపికలను
తిఱిగి తనమాయ, సృజియించి తెచ్చినట్టి
జగదధీశుని చర్యలా శ్చర్య మొందె!

(వెనుకఁ జూచి యాశ్చర్యము నభినయింపుచు) నాథా! అటు చూడుఁడు—గోపాలురు తోలకుండగనే.. పంక్తులుదీర్చి యయ్యాలమంద లెట్లు మనల వెంబడించుచున్నవో!

పెద్ది— అవును దేవీ!

గీ॥ మనల సంతాన చింతాని మగ్న మతుల
నెవఁడు దఱిజేర రమ్మంచు హెచ్చరించె
నతఁడె, లోకైక కళ్యాణుఁ డాలమందఁ
గోలుకొని వచ్చు, నితరులు తోలనేల!

పెద్దమా—సంతాన రహితమగు నీ యాలమందను సంతానవంతముగా నొనర్చుటయే యామహామహుని, యాశయమ్ము కాబోలు!

పెద్ది— అదియు వాని సుకృతమే కదా! ... దేవీ! మార్గగమనంబున, మిగుల నలసితివి- ఈ వేళకిచ్చట విడియుట యుక్తమని తోచుచున్నది (తెగలోఁ జూచి) మందపాలా! నేటికీ సరోవర ప్రాంతంబున, మన శిబిరమ్ముల

నేర్పాటు సేయింపుము— (దేవినుద్దేశించి) దేవీ! మనమింతలోనేగి, యా సరోవర జలమ్ములనాని, సేదదీర్చుకొనుచుందము రమ్మ ...

(నిష్క్రమించి—తిరిగి ప్రవేశించుచు)

పెద్దమా—ఆహా! యేమి! యా సౌందర్యము, నాథా! కథలలో చెప్పుకొనునట్లిది, యప్సరస్త్రీస్నాన సరోవరము కాదుకదా? కాకున్న నీ స్వర్గీయానందము లభించునా? (జలపానము నభినయించి) నీరములెంత మాధురమ్యులు; (ఆనందము నభినయింపుచు) ఆహా! యేమి! ఈ మందమారుతము-నాథా! చూడుడు-

గీ॥ చల్లనగు నీ సరోవర జలములాని,
త్రోవలో తమ్మిగంధమ్ము దొంగిలించి,
పయ్యెదలఁ బట్టి తివిచెడు పవనుఁడవుర,
తల్లిదరిఁ జేరి యాడెడు తనయు నట్లు.

(పతియొక వైపుఁజూపుచు) అటు చూడుడు. ఆతరుకోటరంబున, నున్న తన పసిబిడ్డల కా చిలుకెట్లు మేతఁబెట్టుచున్నదో...ఆహా! జ్ఞానహీనంబులగు నీ పక్షులకే యింతలేసి ప్రేమలా! ...అవును, స్వభావసిద్ధములు, ప్రేమలుకదా! (ఉద్రేకములో) నాథా! అదియేమి!

పెద్ది— అవును! యెగురుట గాని తనచిన్ని బిడ్డ కా చిలుక యెగురుట నేర్పుచున్నది.

పెద్దమా—(చిలుకనుద్దేశించి) ఓ చిలుకా! నాకంటె నీవెంతయు, ధన్యురాలవు సుమీ! యేమందువా!

సీ॥ చిన్నారి పొన్నారి చిన్ని చేతలఁ జూచి,
యూహించి, పాడించి యలరినావు;
పచ్చియు, రాసి య వ్యక్త మాధుర్యపు
బలుకుల బలికించి ప్రబలినావు
పడుచుఁ ద్రాకుచు, నిల్వఁ బడుచును గొనఁగొన
దప్పటడుగులు వెట్టఁ దనిసినావు
ముద్దాడి, వేమాఱు ముద్దాడు మనుచును
నల్లారు ముద్దుల నందినావు

గీ॥ కౌఁగిళులఁ గుచ్చి లాలింపఁ గలిగి నావు
చిన్నిబిడ్డను; యిట్టి సౌఖ్యోన్నతులకు,
నే వ్రతంబులు జేసితి, వెవని గొలిచి
యిట్టి దీవెన లందితి వే! శుకంబ!

పెద్ది— దేవీ! సంతానాపేక్షహృదయవగు నీకెల్ల యెడలఁ, బ్రణయ సంతానమే కనబడుచున్నది. దానికేమిగాని, యీ ప్రకృతి విశేషమొక్కింత యవలోకింపుము.

పెద్ద— నాథా! ఇది మాత్రము, ప్రకృతి విశేషము కాదా! అల్లదే! ఆకొమ్మపైఁ జూడుఁడు.

చ॥ ప్రణయ పవిత్ర భావ పరిరంభణలన్ దమ చిన్ని బిడ్డలన్
బెనఁగొని, ముద్దులాడి, మఱి పెంపువచో రచనానుభూతిచేఁ
దనువులు పారవశ్యతకు, దక్కి యవార్య సుఖైక సంపదన్
దనరెడు నా శుకీశుక వితానము లీ ప్రకృతి ప్రభేదమే,

ఆ ముద్దుల మాటఁగట్టు నా లేడిపిల్లలం దిలకింపుఁడు శయనించియున్న తనతల్లి నెట్లలరి చేయుచున్నదో, (మృగము నుద్దేశించి) ఓ మృగరాజమా! నీవనుభవించు నయ్యానంద మెట్టిదో నాకుం జెప్పుము... (భర్తనుజూచి) మనోహరా! అయ్యానంద మనిర్వచనీయ మగుటచే గాబోలు నీ మృగము మాటలాడ లేకున్నది, చూడుడు.

పెద్ది— (నవ్వుచు) దేవీ! బిడ్డలరంధిని బడిన నీవు ప్రకృతినే మఱచుచుంటివి;

పెద్దమా—అదియేమి! నాథా!

పెద్ది— మృగములెట్లు మాట్లాడునను కొంటివి! అయినను దాని భావమే నెఱింగింతు వినుము,

చ॥ అడుగులఁ గొల్చి యొంతయుఁ బ్రియంబలరన్ జిఱునవ్వు మొగలన్
దొడిగియుఁ, బాహువల్లరులతోఁ, బెనవైచుచు, మోముమోమునం
దిడుకొని, ముద్దుముచ్చటల నెంతయు, బ్రొద్దులు బుచ్చు నా తరుం
దొడరు లతామతల్లికఁ, గనుంగొనుమన్న విధమ్ముఁ జూపెనన్

పెద్దమా—నాథా! యేలనన్ను పరిహాస మాడెదరు, విషయలంపటులగు వారికి, ఆ పవిత్రానందము లభించునా!

గీ॥ కానఁ బెత్తిగిన, పచ్చని ÷ గడ్డిమేసి,
చల్లనగు నీ సరోవర ÷ జలములాని,
చిఱుత నీడనిడి, ముకీయు, నీ ÷ జింక కింక,
దడవి, యాలోకమునఁ, గోరఁ ÷ దగినదేమి!

పెద్ది— సతీ! కళ్యాణేశ్వరుం డచిరకాలంబున, నిన్నట్టి యానందమ్మున, నోలలాడించు గాక.

పెద్దమా—(నిరాశా సూచకముగా) నాథా! నాకట్టి యానందము లభించునా!

గీ॥ ప్రాగ్భవ సమాగతా నేక ÷ పాపకర్మ
సంచిత దురంత దౌర్భాగ్య ÷ జనిత, మందు,
భగవ దహితాగ్నిచే, దహిం ÷ పఁ బడినట్టి
వృక్షము చిగుర్చునే యెట్టి ÷ వృష్టి నైన,

[దుఃఖోద్రేకమున కూలబడుచున్నది]

పెద్ది— (తనలో) స్వభావసిద్ధంబులగు నీవనవిశేషంబు లీమె సంతాన విరహిత విచారమును, నినుమడించు చున్నవి. ఈమె నిందుండి తొలగించుట మంచిది. (ప్రకాశముగా) దేవీ! మన పరిజనులీపాటికి, శిబిరంబుల నేర్పాటు చేసియుందురు, వెళ్లుదము లెమ్ము. [చేతులనుఁబట్టి లేవదీయు చున్నాడు]

పెద్దమా—(విసుగుతో) నాథా! నన్నిందులకు బాధఁబెట్టెదరు.

గీ॥ సుప్రసిద్ధ సంతానమ్ము ÷ సుమ్ము గృహిణి,
భవనమునకును, సర్వసౌ ÷ భాగ్యమందు
నట్టి సంతాన విరహిత ÷ కధమురాలి
కీగభీరాటవులె, సౌఖ్య ÷ మీయఁగలవు.

[తెర లో]

చ॥ మములను, గోపబాలురను ÷ మార్ఖ్య తురుష్కుని కాయమీగతిఁ
శ్రమలనుఁ బెట్టి మా పసుప ÷ రంపర, దొంగిలి పోవు చుండిరో
యమరవరేణ్యులార, సద ÷ యాగ్రిమనో వనవాసులార! తే
రె! మము, విపన్నులఁ కనిక ÷ రించెదు వారొకఁడేని నియ్యెడన్

పెద్దమా—(ఆత్రుతతో) నాథా ! యేమది ! యార్తనాదము,

పెద్ది— ప్రేయసీ ! నీవిందేయుండుము. కనుంగొని వచ్చెద. [వెళ్లును]

పెద్దమా—(ముందుజూచి, యాశ్చర్యము నభినయించుచు) ఇదేమి ! మన్నాథుండదే గోపాలురతోఁ జనుదెంచు చున్నారు.

[ గోపాలురతో పెద్దిరాజు—ప్రవేశించుచున్నాడు. ]

ఆనందుడు—(భక్తివినయముతో) స్వామీ !

చ॥ పిలిచినఁ బల్కు-దిక్కు కను పించని యీ యటవీస్థలిన్ మముం
గలచెడు నీ తురుష్కుల న ఖర్వ భుజాబలులై వధించి, నా
మ్మొలమినిఁగాచి రీరవణా, యెల్లపుడున్ శ్రితరక్షణార్థమై
యలతులఁ ద్రుంపగాఁ దిఱుగు నట్టి కృపాళులు మూలమూర్తులో!

ప్రసాదుడు—(పెద్దమాదేవినుద్దేశించి) తల్లీ! వందనములు (సాగిలిఁమొక్కును)

ఆనందుడు—అమ్మా! బ్రతికినాము, మీ మేలు మరచిపోము తల్లీ !

పెద్దమా—నాయనలార ! మీ దేయూరు; యెటకేగు చుంటిరి,

ప్రసాదుడు—తల్లీ ! మాదీ మల్లయపల్లె తల్లి ! కాశ్రేడు గుడికేగుచున్నాము, తల్లీ!

పెద్దమా—మీరీయసమయంబున నెందులకచ్చటికేగెదరు!

ప్రసాదుడు—తల్లీ ! ప్రతిసంవత్సరమును, కాశ్రేడుఁ గొలుచుట మా కాచారము, మా తోడివారందరు ముందేగిరి,

పెద్దమా—(ఆశ్చర్యముతో) ఈ రాత్రియా ! అచ్చట భయముకాదా.

ఆనందు—ఆ స్వామి సమక్షమందు భయమా ! తల్లీ !

గీ॥ నాఁడు మకరిని దునిమి కరీంద్రము భయమ్ముఁ
దీర్చిన పవిత్రు డద్దయా దివ్యమూర్తి
సమ్ముఖమునందున, భయప్ర సంశయున్న
యగ్ని కొండేనిఁ జెదలంటు ననుట కలదె!

అంతియేకాదు తల్లీ! బాలురమగు మాతోడఁగూడి యాడుకొని, తెల్లవారినతోడనే పప్పు-బెల్లములు మాకు బెట్టి పంపుచుండు.

పెద్దమా—(భర్తనుజూచి) నాథా! ఈ చిన్నబిడ్డల ముద్దుమాటల నాలించితిరా! యేమి! ఆశ్చర్యము, భగవంతుండగు కాట్రేడు వీరితో నాడునట, పాడునట...(సమ్మతముగా) అవును.

గీ॥ మున్ను వ్రేపల్లెలోఁ బాలు వెన్న పెఱుఁగు,
దొంగిలుచు, నింటనింటను దూఱి, గోప
గోపికలతోడ నాడిన గొల్లవాఁడు,
వీరితో నాడెనన నేఁడు వింతయేమి!

నాథా! మనము వీరిననుసరించి, భక్తచింతామణియగు నా స్వామిని సేవించి, తన్మహిమలం గనులారఁ జూచివచ్చుట భాగ్యముకాదే!

పెద్ది— దేవీ! కాట్రేనింజూచు భాగ్యమలవడినందు కెంతయు నానందించుచున్నాను, (తెరలోఁజూచి) మందపాలా! భక్తాపనుండగు కాట్రేనిం బూజింప దేవాలయమ్మునకరుగవలయును; పూజాద్రవ్యములను సమకూర్చి తెప్పింపుము...

మందపాలుఁడు—(తెరలో) చిత్తము.

పెద్దమా—(గోపాలురనుజూచి) నాయనలారా! స్వామియాలయ మెంతదూరమునున్నదనిరి, మాకును జూపింతురా? మేమును వచ్చెదము.

ప్రసా— తల్లీ! ఇక్కడికెంతయో దూరమునుండదు దగ్గరకువచ్చితిమి (దేవునుద్దేశించి) చేదుకో! స్వామీ!! చేదుకో!!!

ఆనందు—(యెగురుచు) రండు! నేను చూపింతును,...(ముందునడచుచు) కాట్రేడు స్వామీ! చేదుకో (వ్రేలితో చూపుచు) అదిగో! అదియే యాలయము.

పెద్దమా—(భక్తితో చేతులు మోడ్చి) ఓ భక్తవత్సలా!

గీ॥ భక్తజనకల్పక వటంచు, ప్రబలినావు
దీనులను, మమ్ము నీ సన్నిధానమునకుఁ,
దోడుకొనుమయ్య, దయతోడఁ దోడుకొనుము
పరమ కరుణాలవాల! గోపాల పాల,!

[నడచుచు నిష్క్రమించును]

పెద్ది— (భక్తితో చేతులుమోడ్చి) ఓ జగద్రక్షకా!

గీ॥ ఓ యనంత! నిరంతమై యొప్పు నీకృ
పారస జలధి నోలాడ వచ్చు మమ్ము
జేదుకొనుమయ్య! దయతోడఁ జేదుకొనుము
భక్తపాలన శీల! గోపాల పాల, !

[నడచుచు నిష్క్రమించును]

ప్రసా— (యెగురుచు) కాటేఁడుస్వామీ! చేదుకో! తండ్రీ? చేదుకో!

[నిష్క్రమించును]

[ తెర పడును. ]



2 వ రంగము—కళ్యాణపుర ప్రాంతారణ్యము.

[ భయవిహ్వలయై పెద్దమాదేవి - ప్రవేశము ]

హా! ఇంకేమున్నది. (భగవంతునుద్దేశించి) హా తండ్రీ! కళ్యాణేశ్వరా! యాత్రావ్యాజంబున ప్రేరేపించుట మమ్మీయట్టడవిని, నీ భయంకరశార్దూలమ్ముల కాహారమ్ముగా, నీ దిక్కుమాలిన చావునకుఁ గుఱిసేయుటకా! ఏల యీ నట్టి యసంఖ్యాకంబులగు నీ పులులను మాకునయ్యో పుట్టించితివా! తండ్రీ!... తల్లికి పిల్లయు, పిల్లకుఁ దల్లియు గాకుండ, చెట్టునకొక్కపిట్ట చొప్పున చెదరఁగొట్టి మమ్మెట్టు లలజడిపెట్టుచున్నావు స్వామీ! రక్షింపుము, రక్షింపుము, (తెరలో చూచుచు) "గాంధ్రుమ"ని పులులు వెంటఁబడుచుండ భయభ్రాంతులై మాపరిజను లెట్లు పరుగిడుచున్నారో!...అయ్యో! సవ్యమగు దారి లేక, పల్లేఱుముండ్లు సూదులవలె గ్రుచ్చుకొనుచుండ, రక్కసపొదలనైన లక్షింపక, ప్రాణభీతిని, దాటుచు, పఱుగిడలేక, పడుచు, నెంతబాధపడుచున్నారు! అబ్బబ్బా! (కన్నులుమూసికొని) చూడలేను... నే నీబాధలుచూడలేను...చూడలేను. మన్నాథుండొక్కఁడెంతని, ప్రయత్నింపగలఁడు. రాత్రింబవళ్లు ఖడ్గహస్తుండయి పరివారముల బ్రోత్సహింపుచు, దద్రక్షణమునకై దిఱుగుచున్నారు. ఈ కాఱడవుల నీ సింహశార్దూల ముఖంబులం జావుమని మా విధివ్రాతకాబోలు! హా! ఇంకేమున్నది. ఇంకెక్కడి బ్రతుకులు...

[తెరలో వినుటనభినయించును]

[ తెరలో ]

చ॥ భయపడఁబోకుఁ డిఁక, పరివారములార! నిసర్గధైర్యముల్
గయికొనుఁ, డేల మీఱటులఁ గల్గర మందెదరేనుఁ గల్గఁగా
పఱుఁబడ వచ్చు నప్పులులఁ బట్టి వధింపుఁడు, పర్వులెత్తినన్
దయఁగొని, నీకునే! యలసు దక్క మఱిమ్మఱి వెంబడింపకన్

సీ॥ భిండివాలాది యుద్దండ శాసన రాజి,
బఱచి, యప్పులిమూకఁ దఱిమివేయుఁ
దుర్గనిస్వనముల కులికి మెకంబులు
వెలిఁబాఱి భేరికా హళుల మ్రోయుఁ

డల్లిబిల్లిగ నల్లు * పల్లేరు తీవెలఁ
దటిగి, మార్గము శుద్ధ * పఱుపఁ జూడుఁ
డటునిటుఁ జెదఱిన, * యాలమందలఁ దోలు
కొనివచ్చి యొకచోటఁ * గూడవెట్టుఁ
గీ॥ దండఱును నొక్కటయి మంద * ముందు వెనుక
లరయుచును, జాగరూకత * నఱుగుదెందు
కొంచెమేమరు పాటును * గొంటిమేని,
యందుకొన నేరమావుల * మందఁ మనము

పెద్దమా—మన్నాథుండదే! చెదఱిన పరిజనులఁజేరదీసి, హెచ్చరింపుచు నిటేవచ్చుచున్నారు. (వెనుకవచ్చు పెద్దపులినిచూచి భయముతో) హా! చచ్చితి! నాథా! రక్షింపుడు-రక్షింపుడు [పడువెత్తుట నటింపుచు నిష్క్రమించును]

[ చేతులతో తనమెడనుబెనవైచియున్న పెద్దమాదేవితో ]

[ పెద్దిరాజు—ప్రవేశింపుచు... ]

గీ॥ సమధిక సమస్త దుష్ట శ * స్త్ర ప్రసిద్ధ
ధర్మ దీక్షాచణైక ని * స్త్రింద్ర ఖడ్గ
రాజిత సుమేరు భుజపంజ * రంపు జిలుక!
పులులకే యింత భయ పడఁ * బోలు నొక్కొ-

పెద్దమా—(కన్నులు తెఱచి) నాథా! యేది! అప్పులి.

పెద్ది— ఇంకను పులియెక్కడ! అబలవగు నిన్నలజడివెట్టిన పాపం బనుభవించినది.

పెద్దమా—యెంతకాల మీ మహారణ్యంబునందిట్లు క్రూరమృగంబుల కలుకుచు నడువవలసియుండునో! నాథా! కాశ్రేనియాలయమ్మున విన్న భయప్రదమగు మహారణ్యమిదియేకాబోలు- ముందెట్టివిపత్తుల నెదిరింపవలసియుండునో!

పెద్ది— అవును... నెచ్చెలీ! ఇయ్యది భయప్రదమనుటకు సందేహ మేమి? ఆవైపు చూడుము!

సీ॥ కడలు మార్మ్రోయగా, * గాంత్రు గాండ్రనుచును
దుమికెడు సింహశా * ర్దూలచయము,
పసిగన్నఁ గన్నని * పడగలెత్తి నటించు
భయదమ్ములగు త్రాచు * బాముపట్లు,

కాలువెట్టఁగ పిలుఁ గాక దట్టంబుగా
నల్లిన పల్లేరు ముళ్లపొదలు
పగలె పాంథులబట్టి నెగటార్చు దొంగలు
ద్దండులు కాపుండు కొండగుహలు
గీ॥ మూఁడుకాలుల "ఘూఘోరున" మ్రోతవిడుచు,
పాలుసుడిగుండముల కొండ వాగుగంప్లు
ఘనానభోభాగముల గప్పు భూజవితతి,
భీతిఁగొలుపదె, నిజముగా ప్రేక్షకులకు.

పెద్దమా—నాథా! చూపఱులకు భయముగొల్పుచున్నను
గీ॥ పాంథజనులకు, స్వేచ్ఛాసు భద్రజీవ
నప్రశాంత శకుంత సం తానమునకు
నాశ్రయమొసంగి, రక్షించు నట్టి, యిట్టి
వృక్షవితతి, ప్రశంసార్హ మేలకాదు!

పెద్ది— అవును! దోపిడిదొంగలకును, కిరాతజాతికిని, నునికికాదున్నచో నీవన్నది సత్యమే!

[ తెరలో ]

మ॥ అరరే! యెవ్వరుమీరు మత్సరి సర ప్రాంతాటవిఁ జేరగా
సుర విద్యాధర సిద్ధ సాధ్య ఖచర స్తోమంబె భీతిల్లునే
తెరవుల్ జొచ్చితి రీరు "వంటయిలు కుం దేల్ సొచ్చిన"ట్లియ్యెడన్
సరి, దైవలబిటు తెచ్చె మూఁదగు బుభు జూపీశ మాయింపగన్

పెద్దమా—(ఉలికిపడి) నాథా? యేమి? ఆ భయంకరారావము

పెద్ది— (దేవిని కౌగిటజేర్చి ముందు చూపుచు) ప్రేయసీ! యేమియునులేదు! భయపడకుము- ఇటురమ్ము (ముందుకు నడచి) ఆ చిత్రముఁ జూడుము

[వ్రేలితోఁ జూపుచు]

గీ॥ వెసల నిండిన ఱెక్కల విసఱుకొనుచు,
శూలముల బోలు గోళ్లఁ జం చువులఁ దెఱచు
కొని మనుష్య భాష, నదల్చు కొనుచు వచ్చు
గండ భేరుండములు రెండు, కడల నవిగో!

పెద్దమా—నాథా! వీనికి మనుష్య భాషణము లెట్లుల వడినవో!

పెద్ది— అవిగో! మనదరికే యరుదెంచు చున్నట్లున్నవి! రానిమ్ము......కాదు కాదు... నీ వబలవు- సమీపమున, వాని భయంకరాకారమును, కఠినస్వరం బులను విన్న భయంపడఁగలవు...నేనే యెదురేగి, వానివిషయ మఱసి వచ్చెద, నిందుఁ గూరుచుండి చూచుచుండుము, భయపడకుము.

[నిష్క్రమించును.]

పెద్దమా—పక్షులు మనుష్యభాషల నిట్లు మానవుల నదల్చి కయ్యమ్ముల ఢీకొను టెంతయు వింత... (ముందుజూచిభయమునభినయింపుచు)అవురా! యేమి! ఈ పోరు, కడుఘోరముగా నున్నదే, (ఆశ్చర్యయుతో) ఆహా? మన్నాథుని కత్తిసామెంత వర్ణనీయము, అట్లారెండు పులుగులు పైకెగసి, తన్నవచ్చిన గత్తిని ద్రిప్పుచుఁ గత్తులపంజరమున నున్నట్లుగ పడుచున్నారు (వినుట నభినయింపుచు) యేదియో యనబోవుచున్నారు.

గీ॥ పక్షులఱు మీరు మనుజులఁ బట్టి తినగ
నేమికారణ మేతుచ్ఛ లీ విధంబు
సేయ బోధించి రెంద ఱ మాయకులిటు
ప్రాణములఁ గోలుపోయెదరో? పక్షులార!

పెద్దమా—(ముందుకు జూచుచు) అమ్మాటలాలించి యప్పులుగులు రోషకషాయిత నేత్రలై నానాథుని, జూచి యేమియో యనబోవుచున్నట్లున్నవి!

[ఆలకించుట నభినయించును]

[ తెరలో ]

చ॥ అనవసర ప్రసంగముల నంతటఁ గట్టుము, నీ సమానుల్గా
మనుజుల వేనవేలు దిని నారము, మా కిది వృత్తి యెవ్వడో
మనిచినయట్లఁ జెప్పెదవు మాటలు కోటలఁ దాటె, ముందుగాఁ
దిని నిను, మేము మా కథలఁ జెల్పగ వింటువుగాక, నిల్వుమీ!

పెద్దమా—యేమీ! వీని గర్వము- ఇట్టి బూకరింపులకు నానాథుండు వెఱచువాడు కాడు- (భయమునటింపుచు) యేమి! యీ యన్యాయము- అమ్మో అప్ప లుకు లాలించుచు నేమరియున్న మన్నాథునిపైకి యప్పులుగు పులుగు లెగసి, బాహువులం బట్టినవి. (ధైర్యముతో) ఇప్పుడునాపతియు నను వెఱంగి బాహుమూలంబుల వానిపాదంబు లదిమి చంచుపుటంబులం గరంబుల

నిమిడించి పట్టుకొనియె! (ఆశ్చర్యముతో) యేమీ! యీ చిత్రము, పక్షు లేవి- ఈ దివ్య పురుషులెవ్వరు ... అనూహ్యమగు నీ పరిణామమేమి! యెంత చిత్రము!! మన్నాథునితో వారిటే వచ్చుచున్నారు.

[పెద్దిరాజు మణిగ్రీవ సుపక్షుల (కిన్నరుల)తో - ప్రవేశించును]

పెద్ది— (దేవినుద్దేశించి) దేవీ! పూజ్యులగు నీ కిన్నరేశ్వరులకు నమస్కరింపుము.

పెద్దమ—(భయభక్తులతో) మహాత్ములారా! దీనను నావందనంబులందుకొనుడు.

[నమస్కరించును.]

మణిగ్రీవుడు—దీర్ఘాయుష్మాన్ భవ [ఆశీర్వదించుచున్నాడు]

సుపక్షుడు—సుపుత్రావాప్తిరస్తు [ఆశీర్వదించుచున్నారు]

మణి— (పెద్దిరాజు నుద్దేశించి) పెద్దిరాజాగ్రణీ! నేటికి మా భాగ్యవశంబున, కరుణామయుండగు భగవంతుండు, శాపచింతానిమగ్నులమగు మాదుఃఖంబులను మావలనంగలుగు లోకులదుఃఖంబులను పుణ్యపురుషులరగు మీ కారణమ్మున నశియింపంజేసె. నేటినుండి, లోకమెల్లసుఖపడుగాక!

పెద్దిరా—మహాత్ములారా! మీ పుణ్యకథా శ్రవణంబునను, మీ దివ్యరూప సందర్శనంబునను, మేము ధన్యులమైతిమి... ధన్యులము (భార్యా సహితముగా నమస్కరించుచున్నాడు.)

మణి— శుభమస్తు...ఓ పుణ్యదంపతులారా!

గీ॥ శత్రుమర్దను డార్త రక్షణ చణుండు
క్షాత్ర తేజుండు, ధర్మ దీక్షా పరుండు,
నగు, సుపుత్రుండు కలిగి మీ కమ్మలరం జేయు
గాత! యా దేవదేవుని కరుణం జేసి,

[అక్షతలు జల్లుచున్నాడు]

సుప— తథాస్తు... [అక్షతలు పట్టుకొని] ఓ యాదవరాజ దంపతులారా!

గీ॥ వినయ విద్యా విశారద, జన హితాభి
లాష, దేవతా భక్తిలాలస, సురూప

యగు, సుపుత్రియుఁ గలిగి, మిమ్మలరఁ జేయు
గాక, యా దేవదేవుని కరుణఁ జేసి-

[అక్షతలు జల్లుచున్నారు]

మణి— తథాస్తు...(అక్షతలుజల్లుచున్నారు) ఓ పుణ్య దంపతులారా! మే మేగుచుంటిమి. మీకు శుభంబగు గాక, యుండుడు

(ఆకాశమార్గమున నిష్క్రమింతురు.)

పెద్దమా—(చనుచున్న వారినిజూచుచు) నాథా! కొడియార్చిన దీపంబులవలె, శాపవిముక్తులగు నాకిన్నరేశ్వరు లెట్లు ప్రకాశించుచు, జనుచున్నారో!... పాపము - వీరిట్టి యుత్తమజన్మలయ్యును, దుఃఖమ్ములవీడి, సుఖింపలేరైరి.

గీ॥ రసఁ బిపీలికాదిగఁ బర బ్రహ్మ వరకు
సకల జీవులకెందు నా జన్మ సుఖము,
అలవడుట దుస్తరంబు, "సౌఖ్యమును, దుఃఖ
మవనిఁ గావడి కుండలం చ" నుట నిజము.

పెద్ది— అవును...నీవన్నది సత్యము - లేకున్న నాజగన్మాత్రధారుండగు నా భగవంతుని యాశయమ్ముల కీ పాత్రస్వీకృతులా! నియామకులు... నెచ్చెలీ! నేటికీవటవృక్షాశ్రయమ్మున, తలఁదాచుకొనుట శ్రేయస్కరమని తోచుచున్నది...(పైకిచూచుచు) చూడుము = ఇంక ముందున కేగు వేళయుఁ గనుపించుటలేదు.

ఉ॥ వారిజబాంధవుం డపరవారిధి, స్నానజపాది కృత్యముల్
దీరుచుకొంట కేగు నదె; పసికూనల మేత ముక్కులల్
గూరిచి తాఁ గులాయముల కేఁగ జనుదెంచెను పక్షిజాలముల్
తూరుపునందు నల్లవియె తోఁచెను నిండుక సాంద్ర చీకటుల్.

పెద్దమా— నాథా! అవును. అట్టులేపరిజనుల కాజ్ఞాపింపుడు...

పెద్ది— ప్రదేశానుకూలముఁ జూతమురమ్మ.

[కలసి నిష్క్రమింతురు]

[అవనిక పడును]

3 వ రంగము—అరణ్యాంతము, - సెలయేరు

పెద్దమా—(భర్తనుద్దేశించి) నాథా! మహోరగసముదాయముల మధ్యమ్మున, మంచి గంధంపు తరువులున్నట్లు నీభయంకరాటవులమధ్య దర్శనీయంబులగు మనోహరదృశ్యంబులుండుట సహజంబుకాబోలు. ఇటుజూడుడు!

[సెలయేటి జలంబులఁ జూపుచు]

గీ॥ గండశిలలను విసుముల గడచు కొనుచు,
జలజలను పాఱు సెలయేటి సందడుల వె,
గరము శ్రావ్యంబు వినుడు, గంగా భవాని
గిలుకు టందెల సందడి పలుకు దెలుపు,

(జలంబుల స్పృశించుచు) ఆహా! హిమజలపూరమ్ములట్టు లెంత చల్లగానున్నవి. (నీరమానుచు) మనోహరా! యెంతరుచ్యములు! సెంకాయపాలనుమించియున్నవి. ఇందులకనియే యేమొ, మహాఋషులెల్లరు, నిట్టి మహారణ్యశైలసానువుల నలవాటుపడిరి.

పెద్ది— అవును... నెచ్చెలీ! ఐహికేచ్ఛాశూన్యులగు నమ్మహామహులకున్నా, హరిణాదిసాధుజంతువులకున్నా నీ తృణజలకాష్ఠసమృద్ధిగల ప్రదేశములే కదా నివాసయోగ్యములు. ప్రేయసీ! మన మిప్పటికీ భయంకరవిపత్పరంపరాన్వితమగు మహారణ్యసీమలందాటి బయటబడితిమి.

పెద్దమా—రక్షించితిరి, "యెంతబయటఁబడుదుము దైవమా"యని, ప్రాణముల గుప్పిడులనుంచుకొనియే, యెన్ని దినములు ప్రయాణముచేయనయ్యె. అమ్మయ్యా! ఇన్నిదినములకుగదా బ్రతికి బ్రజలలోఁబడితిమి. నాథా! ఇట్టి మహారణ్యముఁ దటింపలేకనే యీ కళ్యాణయాత్రను సేవింప నెవ్వరు సాహసింపరైరని తలంతును. కళ్యాణపుర మింకెంత దూరముండును!

పెద్ది— నెచ్చెలీ! ఈ కోయవారి మాటలనుబట్టి యింక నొక్కరోజునప్రయాణముండునని తోచుచున్నది.

పెద్దమా—(ఆనందముతో) అంతసామీప్యమునకు వచ్చితిమా! ప్రాణేశ్వరా! రేపు కళ్యాణేశ్వరుని సందర్శనమలవడునా! ధన్యురాలను- (స్వామినుద్దేశించి) హా! తండ్రీ? కళ్యాణపరమేశ్వరా! ధన్యురాలను. ధన్యురాలను-

[చేతులుమోడ్చి మౌనముతోనుండును]

[ తెర లో ]

ఓ వనవాసులారా! ఓ ఋషిపుంగవులారా! యాదవవంశచంద్రుం డగు పెద్దిరాజభూపాలుం డెందున్నాడు. దయయుంచి వక్కాణింపుడు.

పెద్దమా— (ఉలికిపడి) నాథా! మఱల నేదియో కలకలము వినవచ్చుచున్నది. చూడుడు...తిఱిగి యేయుపద్రవము మూడనున్నదో కదా?

పెద్ది— (ముందుజూచుచు) యెవరో కొలదిపరివారముతోఁగూడి మనజాడల నరయుచు నిటే వచ్చుచున్నారు.

[గంగురాజు పరివారసహితుండై మఱియొకవైపుగా ప్రవేశించుచు]

సీ॥ నాల్గుదిక్కులను నలువురు సోదరుల్
తనుగొల్వ ధరణి నేలిన ఘనుండు,
క్రూరకర్ములఁ దుష్టులఁ ద్రోలి గోపాల
బాలురఁ గాపాడు బాహుశాలి,
బ్రహ్మాది సురల కబ్బని విశ్వరూప సం
దర్శన మందిన ధన్యమూర్తి
కల్యాణపుర యాత్ర గహన మార్గమ్ముని
ష్కంటకంబుగ జేయు సచ్చరిత్రు
గీ॥ డాత్మ బాంధులఁ సహజుల్, ప్రజల సిరుల
నన్ని సుఖముల విడచి పుత్రార్థియగుచు,
పడతియును దాను భక్తిమై నడచి వచ్చు
సుగుణఖనిఁ బెద్దిభూపాలుఁ జూచినారె!

(వినుటనభినయించుచు) అయ్యా? యేమనుచున్నారు!...ఆ సెలయేటి దాపున నున్నారనుచున్నారా! మహాప్రసాదము,...(మఱియొకవైపుగా వచ్చి పెద్దిరాజాదులఁజూచి) ధన్యులము - ధన్యులము. (సమీపించి) ఓ యాదవరాజదంపతులారా! కల్యాణపురాధీశ్వరుండగు మాచాని గంగురాజు, పరివారసహితుండయి, యిదే నమస్కరించుచున్నాడు-

[సాష్టాంగనమస్కృతులాచరింతురు]

పెద్ది— (గంగురాజుపైచేయివైచి) అభీష్టావాప్తిరస్తు. అకారణ బంధుండవగు నీ కియ్యెడ క్షేమమె? రాష్ట్రీయపద్ధతులు ప్రశాంతముగానడచుచుండునా!

గంగు— మీయట్టిపెద్దల యాశీర్వచనవిశేషమ్మున నింతవరకే లోపంబులు కనుపింపవు. స్వామీ! పెద్దిరాజాగ్రణీ!

ఉ॥ సేమమె! మీసహోదరులు, సేమమె బంధులు, రాష్ట్రపుం బ్రజల్
సేమమె! గోశిశువ్రజము సేమమె! పాడియుఁ బంట కూడియు
న్నే! మనవారలెల్ల బ్రతి యేటను గొల్పులు కొల్చి భక్తితో
స్వాములఁ దృప్తిసేయుదురె! శాంతతఁ గాంతురె? మంచి చెడ్డలన్

పెద్ది— శ్రీకృష్ణభగవానుని యనుగ్రహమున నందఱును సేమమె.

గంగు— స్వామీ! దీక్షాబద్ధులగు పుణ్యదంపతుల సేవాభాగ్యమలవడిన నేనెంతయు ధన్యుడను, నాయాతిథ్యము స్వీకరించి కృతార్థునిజేయుడు.

పెద్ది— మిత్రమా! నాపైగల నీయనివార్య ప్రేమకెంతయు సంతసము. కళ్యాణ పరమేశ్వరు దర్శనానంతర మట్లేకానిమ్ము.

గంగు— (సంతోషముతో) ధన్యులము - ధన్యులము...(మంత్రినిజూచి) మంత్రీ! నీవు ముందుగా జని పట్టణమెల్లెడల నలంకరించి, పౌరజనసహితమ్ముగా మంగళతూర్యనాదంబులతో, నెదురరమ్ము...నదీఘట్టమున, స్నానానుకూలములును దైవారాధనకుంగావలసిన పూజాద్రవ్యంబుల సర్వంబును సమకూర్పింపుము- పోయిరమ్ము.

మంత్రి— చిత్తము...[నిష్క్రమించుచున్నాడు.]

పెద్ది—మిత్రవాత్సల్యమెట్టి పనులను చేయింపదు!... గంగురాజాగ్రణీ! గుణహీనమ్ములగు వస్తువులకు గుణమ్ములన్నుగల్పించుట సజ్జనులకు సహజంబుకదా! నీ యీసత్కారములా జన్మస్మరణీయమ్ములు సుమీ!

గంగు— స్వామీ! ఇందు విశేషమేమి!

చ॥ అతిథుల నాదరింపని గృహస్థుఁడు, నన్యాయరక్షణ ప్రవ
ర్జితుఁడగు దుర్జయుండును- విశిష్టజనావన, దుష్టశిక్షణ
వ్రతమతికానిరాజును, నవశ్యము నిష్కృతిలేని పాపసం
గతులయి, రౌరవాది నరకంబుల గూలుదురన్ని జన్మలన్,

అను నార్యధర్మముల ననుసరించి యెవ తెవతివిఘ్యుక్తమ్ములను, వారు వారు, నెఱవేర్చుకొనుట లోకమున కుపకరించుటకాదు, అప్రయత్నంబుగా లభించిన మీబోటిపుణ్యజనుల యాగమసౌభాగ్యము నాహ్వానింపకుండుట "యారగించుదాని నొలుకబోసికొనుట" కాదె !

పెద్ది— మిత్రమా ! సద్గుణంబులన్నియు నీయందె మూర్తీభవించినవి. నీ యట్టి పరోపకారపారీణుల పుట్టువులచేతనేగదా మన యీభరతదేశము పవిత్రీభూతమగుట... మనమింత నీచెట్లనీడల ప్రయాణమగుట మంచిది.

గంగు— స్వామీ ! భగవత్కైంకర్యాభిలాష పిమ్మట్లు తొందరించుటసహజంబు... బయలుదేఱుడు.

[నిష్క్రమించి మార్గాంతరమున తిరిగి ప్రవేశింతురు]

గంగు— స్వామీ ! శౌద్దిరాజాగ్రణీ ! (చేతితో చూపుచు) అదియే ! నాచేతివైపుగాఁ జూడుడు. పరమేశ్వరు నాలయగోపురము కన్పించుచున్నది...

పెద్ది— (చూచుచు) అవునవును ! (చేతులుమోడ్చి) హర ! హర ! శంభో ! శంకర ! పాహిమాం, పాహిమాం...(దేవినుద్దేశించి) దేవీ ! చూచితివా ! కళ్యాణ స్వామిదేవాలయగోపురము. [చేతితో చూపుచు]

గీ॥ స్వచ్ఛనీలాభ్రచుంబిత స్వర్ణశిఖర
మయ్యదిగో ! కంటె? కనుపండు వగుచుఁదోఁచె
నిర్మల సరోవరాంతరో న్నీలతాచ్ఛ
భర్మసౌవర్ణపద్మంబు పగిదిఁదెగడి.

పెద్దమా—(చూచుచు) అవును ! నాధా ! అవును ! (చేతులుజోడించి) పాహిమాం. తండ్రీ ! భక్తవత్సలా ! రక్షింపుము - కళ్యాణపరంధామా ! మమ్మురక్షింపుము. (భర్తనుద్దేశించి) ముందునకేగిన కొలందిఁ దశ్శిల్పములెంత స్పష్టముగా గన్పించుచున్నవి. (ముందునకేగుచు) ప్రాణేశ్వరా ! యేమి ! యీచిత్రములవిన్నాణము. ఆహా ! బ్రహ్మసృష్టికంటె శిల్పబ్రహ్మసృష్టియే యధికమ్ము సుమీ !

పెద్ది— ప్రేయసీ! అందు సందేహమేమి! చూడుము.

సీ॥ రమణీయసౌధ వి ॥ భ్రాజితంబైన లం
కాపురిఁ గట్టిన ॥ కౌశలంబు
రంగదుత్తుంగ త ॥ రంగఘూర్ణిత మహాం
భోరాశి బంధించు, ॥ బుద్ధిఘనత
శాస్త్రవాగమనంబుఁ, ॥ జాటుపాతాళ న
గ్రపు తులాద్వార ని ॥ ర్మాణశక్తి
విపరీతములను క ॥ ల్పితమైన మయసభా
భవన శిల్పంబుల ॥ పనితనంబు,

గీ॥ అచరములకు జ్ఞానంబునీ ॥ యఁగలనేర్పు
శిల్పులకుఁగాక యన్యుల ॥ చేతనగునె!
"ఇది"యనగనేల క్షితిఁజీవ ॥ నైకధనము
నతఁడు వెట్టిన భిక్షా కా ॥ దా! తలంప

హాళికునకు హాలంబును, యోధున కాయుధంబును, కరణంబునకు గంటంబును, కాపునకు కఱ్ఱయు, ప్రభువర్గంబులకు దుర్గంబులును, పౌరులకు భవనంబులును, నొసంగి, లోకోపకారధురీణులై బాసిల్లు శిల్పవిద్యాధురంధరులు వందనీయులనుటకు సందియంబుండునే! అదియునుగాక; యెట్టి పాపాత్ములకును భగవత్యైకర్యేచ్ఛ జనింపంజేసి, మోక్షమార్గముం జూపుట కీ పవిత్రమూర్తి యేకారణభూతుండు సుమీ! యెట్లందువేని?

గీ॥ హంతకులుఁ, జారులునుఁ, జోరు ॥ లైనఁగాని
తాము తలపోయు కార్య సా ॥ ధనము కొఱకు
నిట్టిదేవస్థలంబు క ॥ న్పట్టినప్పు
డైన, భక్తిని భజియింతు ॥ రా మహాత్ము,

ఆసూక్ష్మాగాధనచేతనే యనఘులై యాముష్మికమందగల్గుదురు.

గంగు— స్వామీ! అందుకుసందేహమేమి- ఇట్టి పవిత్రక్షేత్రంబులేవంతునకైనను, పాపాచరణ నిరోధకములు కాకపోలేదు...

పెద్ది— (వినుటనభినయించి) మిత్రమా! ఆ వినవచ్చునది, భాగీరథీతరంగ ధ్వానమే నా! ఆహా! యేమి! ఆవీచీసౌమ్యస్వానము!

గీ॥ సంతు లేనట్టి వారికి సంతునొసఁగి
యేలు కళ్యాణపరమేశు డెందుఁగలఁడు
రండు! మీ కోర్కెలను దీర్చు కొండు, వేగ
మనుచు, బిలిచెడు నట్టుల విసఁగనయ్యె!

గంగు— (ముందుజూచి) మహాపురుషుల దర్శనము పుణ్యప్రదమని కాబోలు, ప్రజ లుత్సాహంబున బఱుగిడుచు వచ్చుచున్నారు. స్వామీ! మన మావిశాలప్రదేశమ్మునకుఁ జనుటమంచిది.

[నిష్క్రమింతురు]

[అవనిక పడును]

ఇది
శ్రీ సీతానగరాంజనేయ కరుణా కటాక్ష ప్రలబ్ధ కవితా
శిల్ప ప్రవీణ, పట్నాల వంశోద్భవ అన్నపూర్ణా
చిదంబరాచార్య జ్యేష్ఠ తనూభవ
సుబ్బరాయ నామధేయ
ప్రణీతంబైన
"కాటమరాజు"
అను
దృశ్యకావ్యంబునందు,
ద్వితీయాంకము.
సంపూర్ణము.

---



శ్రీ

# కాటమరాజు.

తృతీయాంకము.

1 వ రంగము — కళ్యాణేశ్వరునాలయము.

[ పెద్దిరాజు పట్టువస్త్రధారియై చేతులనుఁ జోడించి ]

దండకము.

శ్రీ మద్రమానాథమిత్రా! మహేంద్రాది దిక్పాలకస్తోత్ర! క్రూరాసురానేకజైత్రా! దివానాథచంద్రాగ్ని నేత్రా! మహాశైలకన్యాకళత్రా! నమోభవ్యనామా! నమోభక్తసౌలభ్యసీమా! నమోనవ్యకారుణ్యధామా! భవచ్చర్యలాశ్చర్యముల్ పద్మగర్భాది గీర్వాణలోకంబు వాచ్యంబనూహ్యంబ గమ్యాంబటంచెంచుచుండంగ, మేమెంచఁగా నెంత, స్వామీ! భవత్పాదరాజీవరేణూ వినోదైకచిత్తుండ నీనామసంకీర్తనానంద భక్తుండ రక్షింపవేతండ్రి! దక్షాధ్వరధ్వంసమా పాపవిధ్వంసముల్ జేసి సంతానసంపత్తి జేకూర్చి యోసచ్చిదానందమూర్తీ! కృపాలోక సద్భక్త భద్రానువర్తీ! నమోపాహి,మాంపాహి! మాంపాహి! యోయామిశీతోద్యన్నిధానా! త్రిలోకైక సంరక్షణోద్యద్విధానా! నమస్తే, నమస్తే, నమః

[సాష్టాంగ నమస్కృతులు చేయును.]

పెద్దమా—(చేతులు మోడ్చి)

* సీ॥ భసితాంగరాగాయ! శ్రీ భక్తాను పక్తాయ!
ఫాలేక్షణాయ! తుభ్యం నమోస్తు
భర్మాద్రి చాపాయ? శ్రీ భద్రేభవాహాయ!
భవ విదూరాయ! తుభ్యం నమోస్తు
భండనోద్దండాయ? శ్రీ భానుప్రతాపాయ!
భవ్యరూపాయ? తుభ్యం నమోస్తు,
భరత ప్రవీణాయ! శ్రీ భవనాశ యతనాయ!
భద్రప్రదాయ! తుభ్యం నమోస్తు
గీ॥ భావభవ సంహారాయ! తుభ్యం నమోస్తు
భవపరం నాటకాయ! తుభ్యం నమోస్తు
భద్ర చర్మాంబరాయ! తుభ్యం నమోస్తు
భారతీశార్చితాయ! తుభ్యం నమోస్తు.

[సాష్టాంగ నమస్కారము లాచరించును.]

[పెద్దిరాజు భార్యాసహితముగా కూరుచుండ ధూపదీపనైవేద్యములను చెల్లింపుచు...]

అర్చకులు—

ఓం చిదానంద స్వరూపాయనమః
ఓం సర్వశూన్య లంబాయనమః
ఓం స్వప్రకాశ స్వరూపాయనమః
ఓం అఖండ మండల భూషణాలంకార విగ్రహాయనమః
ఓం ప్రపంచ ప్రజాలంకార సుందర విగ్రహాయనమః
ఓం సురా సుర గణసేవితానంద మంగళవిగ్రహాయనమః
ఓం ప్రజామానసార్చితానంద విగ్రహాయనమః
ఓం సర్వప్రాణి రక్షణాధార విరాట్ స్వరూపాయనమః
ఓం భూర్భువస్సువాది సర్వలోకానంద స్వరూపాయనమః
ఓం బ్రహ్మాది స్తంభ పర్యంత సర్వప్రాణి హృత్కమల నివాస
పరిపూర్ణ చైతన్య స్వరూపాయనమః

* పూర్వకవిరచితము

[నైవేద్యములను చెల్లింపుచు, పళ్లెరమున గర్పూరము వెలిగించి;
పెద్దిరాజాదులకందించును. అమృతమిత్తురు.]

[ఆలయాంతరమునుండి]

ఉ॥ మెచ్చితి, నీదు భక్తికిని, మెచ్చితి నీ వినయాది సద్గుణో
ద్యచ్చరితంబు, మెచ్చితిని తావక ధర్మపరత్వ దృష్టికిన్
మెచ్చితి, మీ పరస్పర సమాహితపుం మిధునానురాగమున్
మెచ్చిరి, దేవతల్ సతము, మిక్కిలి ధన్యుడ వీవు, పుత్రకా!

కుమారా! పెద్దిరాజా! మీరు సంతానవిరహిత చింతామగ్నుండవై వచ్చితివనుట నేనెఱుంగుదును, మీకుం గల లక్ష్యప్రధానమున నేటికి కర్మవిమోచనులరైతిరి...ధన్యులరు. మీ యభీష్టంబులు సిద్ధించుగాక — లోకకంటకులు ప్రబలి నిరాటంకముగా సంచరించు నీ కాలమున, తన్నిగ్రహమునకున్ భక్తవత్సలుండగు శ్రీమన్నారాయణుండు పవిత్ర దంపతులరగు మీ గర్భంబునం జనించు. ఇటకు నైరృతి దిక్కుగా క్రోసెడు దూరమ్మున నున్న సరోవర ప్రాంతంబున, నొక గజనిమ్మ కలదు. ఆ నిమ్మను ప్రదక్షిణమాచరించి, యమ్మాధవుని ధ్యానించి రెండు పండులన్ భుజింప, నీ దేవికి నొసంగుము. దానంజేసి యప్పుండరీకాక్షుని యంశంబున నొక్క కొమరుండును, పార్వతి యంశంబున నొక్క కొమరికయు జనించును. తత్సంతానంబున, నీ వనంత పుణ్యలోక సౌఖ్యంబులన్ గాంచెదవు గాక......

పెద్ది.— (భక్తితో చేతులుమోడ్చి) ధన్యోస్మి! ధన్యోస్మి!

చ॥ అడిగిన యంతలోన సకలార్థములన్ దయచేసి భక్తులన్
గడుదయ నేలువాడ వనగా! విని నందులకున్ నిదర్శనం
బుడుగక గాంచినారము సమున్నతి నొంతయు ధన్యమయ్యె మీ
యడుగులఁగొల్చు మా బ్రతుకులయ్య! పరాత్పర! భక్తవత్సలా!

తండ్రీ! పరమేశ్వరా! నీ యాజ్ఞలనుల్లంఘ్యములు అనర్ఘములు ధన్యోస్మి-ధన్యోస్మి

[సాష్టాంగపడి లేచుచున్నారు]

[ ఆలయమునుండి ]

కుమారా! పెద్దిరాజా! మఱొక్కమాట - నీవు సంతానవంతుండవైనది మొదలు, నేడేండ్లు నా సామీప్యమున, మదీయ భక్తుండవై యుండవలయును. ఇయ్యది దైవసమ్మతముగా నెఱుంగుము.

పెద్ది— (చేతులు జోడించి) మహాప్రసాదము-తండ్రీ! మహాప్రసాదము. యేడేండ్లు కాదు నా యావజ్జీవముండుటకు మాత్రమభ్యంతరమేమి! తండ్రీ!

గీ॥ గుఱుతరంబగు పున్నామ నరక ముత్త
రించు కొమరుని గలిగించి సంచితార్థ
కల్పకములు, భవత్పాద కమల సేవ
నుండుమన, నెవ్వడొడబడ కుండునయ్య!

తండ్రీ! నీ యాజ్ఞలు మా కవశ్యాచరణీయమ్ములు. అప్రతిహత నిర్వాహకములు స్వామీ!

[దంపతులు సాష్టాంగ పడుచున్నారు.]

[ అవనిక పడును. ]



2 వ రంగము — ఆర్లపెంటపురము.

[వాలకేతుఁడు శేషాద్రిరాజుతో సంభాషించుకొనుచు ప్రవేశించుచు]

వాలకేతుఁడు—(తలపంకించుచు శత్రువునుద్దేశించి) ఓరీ! దుష్టా?

సీ॥ తలఁపవే! నిఖిల శాత్రవ భీకరారణ్య
దావాగ్ని కీలా ప్రధాను నన్ను
వీక్షింపవే! జగ ద్విశ్రుత భూత భే
తాళాది వశ్య మంత్ర విదు నన్ను
యెఱుఁగవే! త్వత్కులో ద్ధిత వృద్ధ బాలక
నాళీక సమద కుంజరుని నన్ను
కాంచవే! ప్రతిదిన క్రతు విశేష వివర్ణ
కలిత పయః పూర కరణు నన్ను
గీ॥ ఇంతలో నింత మఱచితి వే! దురాత్మ
మత్తు జెందితె; కన్నులు నెత్తికెక్క-
నా! నిరంకుశస్థైర్యులు నస్మదాగు
లపుర! నీకింత తెలివిక యైతె, చూః!

అవును...చెట్టు చెడుకాలమునకు కుక్క మొతికె పిందెలు బుట్టునట్లు నీకీ పోగాలపు బుద్ధులు పుట్టినవి-లేకున్న; "వాలకేతుని భుజాబలాశ్రయ సంపన్నులు మదన కుంభిళు లనుట" మఱతువా! ఓరీ! దుర్మతీ! మదీయ క్రోధాగ్నికి భవత్సైన్య వహంబులు, భస్మీపటలంబగు నప్పుడును. సమర రంగంబున నుండి నీవు వెన్నిచ్చి కాలు కొలందిఁ బఱువిడు నప్పుడును నీ యీ బీరమ్ము లెందుఁబోయినవి- చేఁజిక్కినప్పుడు దయదలంచి నిన్ను విడచుట నాదియే తప్పు. (శేషాద్రినుద్దేశించి) మిత్రమా! యేమిఁ జూచుకొని యీతని పొంగిపాటు,

సీ॥ తాత ముత్తాతల తరతరంబుల నుండి,
మండు వైరాగ్ని సొమ్మసిలలేదు
అఖిల భూత వశీకరైక మంత్ర ప్రయో
గములు, నొక్కింత భంగ పడలేదు
పడద్రొక్కి తద్బాంధవ శ్రేణి కుత్తుకల్
నఱికిన కత్తి బండ వడలేదు
నాఁడు పాఱిన, రక్త నదు లిప్పటికి నేని
యాహవ భూమిలో నారలేదు

గీ॥ అతులిత పవిత్ర మత్ప్రయోగ గా ద్వితీయ
భూత సంకల్పిత విచిత్ర ముల భయమ్ము
లింతకుఁ బ్రతిక్షణము, వధి యించుచుండ
మిగుల చిత్రమ్ము నీతని మిడిసిపాటు-

శేషాద్రి—స్వామీ! నిజము. ఇందులకొక కారణమున్నది యేమందురా! ఈ మధ్య యెలమంచిలినుండి పెద్దిరాజను యాదవ భూపాలుండు సంతానార్థియై కళ్యాణపరమేశ్వరు నారాధింపఁ జనుదెంచెను. అతఁడు రణవిద్యాకుశలుండట. అదియెఱింగియేమొ, గంగురాజు, ముందుగాజని, యతిథిసత్కారంబులం దృప్తునిఁజేసి పట్టణమునందే యుంచుకొనియెనని వింటిని.

వాలకే—(సాక్షేపముగా) ఇక నాతనికొక యాదవరాజా, దిక్కగునది బాగు పూర్వము జరాసంధునకు కృష్ణుండు వారికి కీరికి సాయము సేతునని తొంబది తొమ్మిది సార్లోడిపోయి చివరకు, గంగలో యిల్లు కట్టుకొనెనట ఇతడెన్ని మార్లోడి యెక్కడిల్లు కట్టుకొనునో!

శేషాద్రి—(నవ్వుచు) మంచిమాట చెప్పితిరి. మీయట్టిపరాక్రమోపేతులను మార్కొనిన నంతకాకింకెంత!

వాలకే— మఱింకెవ్వరు సాయపడుదురు,

శేషాద్రి—కళ్యాణపుర ప్రాంతంబులంగల యాదవయోధులెల్లరు, నీ పెద్దిరాజునకు విధేయులై యాతని యాజ్ఞానుసారము గంగురాజునకు సాయముచేయుదురని తోచుచున్నది

వాలకే—అవును! యాదవవంశమ్మునందిది యొక విశేషమే!

గీ॥ ఏఱులై రక్తములు ప్రవహించుచున్న
మేనువ్రాయి, కంకాళముల్ మిగిలియున్న
స్వకులు డొక్కండు రణమునఁ జచ్చెనేని,
యందఱును జత్తు రతనికై యొందఱున్న

స్వకులాభిమానమున వారిదే పెట్టినపేరు. ఇంక నాగవర్మ్యంజనేయాదులందులోని వారేకదా!

శేషాద్రి—వల్లభనాయని చెప్పవలసినదిలేదు, మీ రెఱింగిన విషయమే!

వాలకే—అయినను, భయములేదు. సంఖ్యయందు గడుంగడు స్వల్పము... మిత్రమా! ఆశ్వీజ శుద్ధవిదియను, దక్షిణ దిగ్విజయ యాత్రకుఁ సైన్యము గూర్చితిని. తిరిగి వచ్చిన పిదప, మనమెల్లఱమును. కలసి, కళ్యాణ దుర్గమును నేలపట్టి యొనరింలము- అందాక గోప్యము పట్టుడని, మన మిత్రులతో వచింపుము.

శేషాద్రి—చిత్తము. నేను వెళ్లివత్తును. [నిష్క్రమించును.] (తెరబడును)

3వ రంగము—పశువులబీడు

[నందుడు, సుందుడు, మొదలగుగోపాలురు, పాటలుపాడుచు ప్రవేశము]

నందుడు— హరిహరి నారాయణాది నారాయణా,
కరుణించి మమ్మేలు కమలలోచనుడ!
గోపాలురనుగూడి కోలచేకొని పోయి
గోవులను గాచాడోయి గొల్లకృష్ణుండు.
ఉట్టిపై నున్నట్టి మట్టిగుత్తులఁ బొడిచి
పాలన్ని తెగద్రావె, బాలకృష్ణుండు.
అత్తింటి కోడల్ని ఆడరాదంటేను
కొంగుఁబట్టుకలాగి కొసరి ముద్దిడెను.
అలనాడు గోపాలుఁ డాగోపికలఁ జూచి
పండ్లిక్వ్యడంచును పైనబడ్డాడోయ్.
జలకమ్ములన్డోగు సతుల కోకలఁ దీసి
చెట్టెక్కి కూర్చుండె, చిన్నికృష్ణుండు.
కంసాధ ముండట్లు కఠినుడై జగమేచ
యెగతేసి యెగతేసి యెత్తికొట్టాడోయ్

నందుడు—అరేయి! సుంద! మన యెల్లావును మల్లేయరా! కాస్త

సుందుడు—అన్నా! మొన్న మన కవిలావు యీనిందిగందా! చూచావా! దూడను యెంత బాగుందిరా! దానిమూతి, దానిచెవులు, ముద్దొస్తున్నాయి.

గోపుడు—అరే! నందా! అదిగో పెద్దిరాజుగారావు పోతుంది, మల్లేయండ్రా!

నందుడు—కాటమరాజు వచ్చాడుగా, మల్లేసుకుంటాడులే!

సుందుడు—పాపము, చిన్నపిల్లవాడు, అతడేమి మల్లేసుకుంటాడురా! ... అయినా యేడి! ఆతను [చుట్టుపట్ల చూచుచున్నాడు]

గోపుడు—ఇప్పుడే నే నాతన్ని, నాచెట్టుక్రింద చూచాను! (చెట్టువైపుచూచి] యేడీ!

నందుడు— "పాపము చిన్నపిల్లవా"డని మల్లేసిపెట్టుంటే మతీ! యెక్కడుంటే అక్కడే ఉంటాడు.

సునందు—ఛా! అట్లా అనకు- మొన్న ఆయిదోయేట బళ్లో వేసారురా! అప్పటినుండి యేదో! "రామ" "రామ" యని తనలోనే యనుకుంటూ ఉంటాడు, నేను చాలాసార్లు విన్నాను పిలిస్తే పలుకడు ఏదో రామ మంత్రోపాసన కాబోలు-

నందుడు—ఏదోలే! ఇప్పుడెట్లా! ఇంటికివెళ్లే వేళయ్యింది, యీతడెక్కడికో పోయినాడు. యింటికెళ్లగానే వాళ్లమ్మ అడుగుతుంది యేంచేద్దాము-

సుందుడు—ఈవైపుగాజూచి వద్దాము, రండి, (అందఱును లేచి నడచుట నభినయించుచున్నారు.) ఇవిగో! అడుగులు. యిటే పోయియుండును [జాడచూపును]

గోపుడు—ఛా! ఇవికావురా! చక్రలాంఛనాలేవి!

సునందు—(మఱియొక చోటు చూపుచు) ఇవిగో! తప్పక యివియైయుండును. చూడండి, గీతలు-

నందుడు—అవును. యిట్లెక్కడికి పోయియుండును ఒక యావుకూడా తోలుకొని పోయినట్లు గన్పట్టుచున్నది. (నడచి కొంతదూరముపోయి) మన మెప్పుడీ వైపునకు, రాలేదుసుమీ! యింతదూర మీతడెందుకు వచ్చెనో!

[నడచుచున్నారు]

సునందు—అరే! గోపా! చూచావా! ఆ వనమెంత వింతగా నున్నదో!

గోపుడు—అవి సీతాఫలాలేనా! యేమి పండినవి! యేమి పండినవి! అబ్బా! నోరూరుచున్నది

నందుడు—రెండు పండ్లు కోస్తాను ఉండండి! (కోయబోవును)

సుందుడు—అరే! అన్నా! తప్పుకాదంట్రా! అమ్మతో చెప్పుతానుండు...

నందుడు—(విరమించి) ఈ యడుగులజాడ లీవనములోనికే యగపడుచున్నవి, ఇతడీ వనమెప్పుడు చూచాడో! (వనములో ప్రవేశించుచున్నారు)

[వెనుక యవనిక యెత్తబడును.]

[కాటమరాజు పద్మాసనుండయి నొక వాల్మీకముచెంత కూరుచుండి యుండును, వాల్మీకమునుండి గంగాధరుడు ప్రత్యక్షమగును.]

గంగాధరుడు—

ఉ॥ ప్రాయమునందు జూడఁ బసి వాడవెయైన, మనోనిరోధ మ
జ్జేయపటిష్టతా ప్రథను శ్రేష్టుడవీవు! కుమార! లెమ్ము నీ
చేయు తపంబు తృప్తిపర చెన్ నను, మెచ్చితి, గోరుకొమ్ము నీ
కేయవి కాంక్షణీయములో యిప్పుడ యిచ్చెద నెట్టివేనియున్

లెమ్ము కుమారా! లెమ్ము

కాటమ —[సాష్టాంగపడిలేచి, చేతులు జోడించి]

* సీ॥ జయజయ కైలాస శైల నికేతన,
జయజయ దేవతా సార్వభౌమ,
జయజయ గిరితనూజా మనోంబుజ భృంగ
జయజయ దేవ వేశ్యా భుజంగ,
జయజయ నిగమాంత సముదయ సంవేద్య
జయజయ భువన రక్షా ధురీణ,
జయజయ జలజాత సంభవోద్ధతి చండ
జయజయ శాశ్వతైశ్వర్య ధుర్య
గీ॥ జే, పురంధర, హరివిరించి ప్రముఖాఖి
లామరస్తోమ మకుటాంచలాంచితాబ్జ
రాగ మాణిక్య రోచిర్విరాజ మాన,
శరణు పంకేరుహోద్దేశ! హర! మహేశ!

ఉ॥ ధన్యుఁడనైతి, సూర్యశశి దాహక నేత్ర! మురారిమిత్ర! నీ
పుణ్య పవిత్ర దర్శన విభూతి గడించితి, తోడివారిలో
మాన్యుఁడనైతి, నీ యనుపమాన, దయాపరిదత్త మానసా
మాన్య వరంబులంది, ననుఁ మన్నుము, నీ పదభక్త రేణువుగ్

* గీ॥ జంతుజాలమ్ము నిజకర్మ సమితి చేత
నుర్వి సుఖ దుఃఖముల నొందు చుండుఁ గాని
కర్మ ఫలమిచ్చునల జగత్కర్త వీవ
భాను శతకోటి సంకాశ? పార్వతీశ!

సృష్టిస్థితిలయ కారణభూతుండవగు, నీ దయయే సదా వాంఛనీయము- తండ్రీ! కాని, భక్తాభీష్ట ప్రదుండవగు నీవు "కోరుకొను" మన్నప్పుడు, నే నర్థింపకుండుట యుచితంబు కాదు- కాన,

* పూర్వకవి రచితములు

గీ॥ దేవ! యణిమాది సిద్ధుల దివ్య పరశు
శస్త్ర జయము నొసంగి, యుష్మత్పదాబ్జ
సేవనా తత్పరునిగ, రక్షింపుమయ్య
దేవదేవ! గంగాధర ! దివ్యతేజ !

గంగాధ—కుమారా! నీయభీష్టంబులు సిద్ధించుగాక! (చేతితో చూపుచు) అవిగో! నా మహిమచే జనించిన నీలకువన్నె పశుగణంబును, నీ యొంటికొమ్ము బొల్లియావును, నీ స్వాధీనము చేయుచుంటిని. వీనిని, ప్రేమతో రక్షించుకొనుచు సర్వైశ్వర్యమ్ములం దులదూగుము శోకను, నీకేదేని, కొఱంత కలిగిన నీ యొంటికొమ్ము బొల్లియావువలనం కృతాభీష్టుండవయ్యెదవు గాక ...

[అంతర్ధాను డగు చున్నాడు]

కాటమ—మహాప్రసాదము, తండ్రీ! మహాప్రసాదము.

[నందాదులువచ్చి కాటమరాజును, చుట్టుకొనుచున్నారు]

సునందు—(చేతులు జోడించి) మహాభాగా ! నీ స్నేహమ్మునంజేసి, మే మెల్లర ము ధన్యులమైతిమి. మహాదేవుని, సందర్శన సౌభాగ్యమందితిమి—ధన్యులము, మిత్రమా ! నీ చరిత్రమ్ము మహాద్భుత సంపన్నంబు.

నందుడు—(కాటమరాజు నుద్దేశించి) మిత్రమా ! మహాపురుషుండవగు నిన్ను మాతోడివానిగా, నెంచుచుండిన, మమ్ము క్షమింపుము (సాగిలి మ్రొక్కుచున్నాడు)

సుందు— సామాన్యునిగా నెంచి నీయెడ నాచరించిన మా నేరములను క్షమింపుము.

[సాగిలి మ్రొక్కుచున్నాడు... గోపాలురెల్లరును సాష్టాంగ పడుచున్నారు]

కాటమ—(అందఱిని దగ్గరకు జేర్చి) మిత్రులారా! నేను మీయందఱికంటె నెందునను గొప్పవాడనుకాను. నాకెందులకింత సన్మానము. నాయందు మీకుంగల యీ యభిమానమునకే నెంతయు కృతజ్ఞుండను. మిత్రులారా! భగవద్భక్తిచేత, మీరుకాదు, నేనుకాదే ప్రాణియేనిం దరింపగలదు. (పుట్టనుచూపుచు) నీ వాల్మీకమ్మున, గంగాధర లింగంబుండుట నొక కామధేను వెఱింగి, ప్రతి

దినంబును, తదభిషేకార్థమై దుగ్ధంబులం గురియించు చుండు, నేడు నా కయ్యావు కనుపించుటం జేసి, వెంబడించి యిందువచ్చితి భక్తవత్సలుండగు నీ గంగాధరుండు నా గంగిగోవునకు సాయుజ్యసంపదను దయచేసి నన్నును నా భక్తవత్సలుండు, కృతార్థుని సలిపెను. దీనికి ఈశ్వరారాధనయే ప్రధానము. గావున గంగాధరుని భజింపుదము రండు

[పుట్టచుట్టు చేతులు తట్టుచు తిరుగును]

అద్భుతవిగ్రహ! ✻ అమరాధీశ్వర! ✻ అగణిత గుణగణ ✻ అమృతశివా! *

సాంబసదాశివ! సాంబసదాశివ! సాంబసదాశివ! సాంబశివ!

ఆనందామృత! ✻ ఆశ్రితరక్షక! ✻ ఆత్మానంద మహేశ శివా!

(గోపాలురు) సాంబసదాశివ! ... ... శివ

ఇందుకళాధర! ఇంద్రాదిప్రియ! సుందరరూప సురేశ శివ!

(గోపాలురు) సాంబసదాశివ! ... ... శివ

ఈశ! సురేశ! మహేశ! జనప్రియ! కేశవసేవిత పాదశివా!

(గోపాలురు) సాంబసదాశివ! ... ... శివ

ఉరగాదిప్రియ భూషణ! శంకర! నరకవినాశ! నటేశ శివా!

(గోపాలురు) సాంబసదాశివ! ... ... శివ

ఊర్జిత దానవ నాశ! పరాత్పర! ఆర్జిత పాపవినాశ శివా!

(గోపాలురు) సాంబసదాశివ! ... ... శివ

ఋగ్వేదాదిశ్రుతిమౌళి విభూషణ, రవిచంద్రాగ్ని త్రినేత్ర శివా!

(గోపాలురు) సాంబసదాశివ! ... ... శివ

ౠపమనాది ప్రపంచ విలక్షణ, తాపనివారణ తత్త్వ శివా!

(గోపాలురు) సాంబసదాశివ! ... ... శివ

---

* పూర్వకవి రచితము

లింగస్వరూపా! సర్వబుధప్రియ! మంగళమూర్తి! మహేశ శివా!

(గోపాలురు) సాంబసదాశివ! ... ... శివ

ఙ్ఞానాధీశ్వర రూపప్రియశివ! వేదాంత ప్రియ వేద్యశివా!

(గోపాలురు) సాంబసదాశివ! ... ... శివ

ఏకానేక స్వరూప! విశ్వేశ్వర! యోగిహృదిప్రియ వాస శివా!

(గోపాలురు) సాంబసదాశివ! ... ... శివ

ఐశ్వర్యాశ్రయ! చిన్మయ! చిద్ఘన, అచ్యుతానంత మహేశ శివా!

(గోపాలురు) సాంబసదాశివ! ... ... శివ

[అవనిక దింపబడును.]

ఇది

శ్రీ సీతానగరాంజనేయ కరుణా కటాక్ష ప్రలబ్ధ కవితా

శిల్ప ప్రవీణ, పట్నాల వంశోద్భవ అన్నపూర్ణా

చిదంబరాచార్య జ్యేష్ఠ తనూభవ

సుబ్బరాయ నామధేయ

ప్రణీతంబైన

" కా ట మ రా జు "

అను

దృశ్యకావ్యంబు నందు,

తృతీయాంకము.

సంపూర్ణము.

---





శ్రీ

# కాటమరాజు.

## చతుర్థాంకము.

### 1వ రంగము.—దర్బారు.

[గంగురాజు సింహాసనాసీనుండై సహాయ సామంతులతో కూర్చుండును]

గంగురా.—(పెద్దిరాజు నుద్దేశించి) యాదవాగ్రణీ! మీస్వార్థత్యాగమసదృశము కదా!

చ॥ సమష్టికి శౌర్యధైర్య భుజ సత్త్వము లేర్పడ యుద్ధభూమిలోఁ
ప్రమద విరోధివర్గముల పైఁ బడి సింహకిశోర మట్టులన్
సునిహిత ఖడ్గధార కేళిఁ జూపితి రెంతటి సాహసంబు, మీ
యమిత దయార్ద్ర దృష్టి జయ మందితి నందితి సర్వసౌఖ్యముల్

నాగవర్మ—సింహకిశోర మందు రేమి! త్రిపురాసుర సంహారకుండగు నప్పరమేశ్వరుఁ దలపించు, నిస్పృహామహు, నాసమయంబునఁ దేటిఁజూడఁ గలిగిరా!

చ॥ వెఱకను, ముందుఁ గ్గొనక, వీరరణావనిఁ, జేతఖడ్గముల్
గొని వెసనంటి యే మదన కుంభిభటులన్ దెగటార్చె నర్జునుం
డట్లు, మును నా త్రిగర్తుల శిరాళి విరక్తిన, మాచరించి న
ట్లనఘుఁడు, పెద్దిరాజ వసుధాధిపుఁ డాతని నెన్న శక్యమే!

వల్లభనాయడు—(పెద్దిరాజునుజూచి) మహాప్రభూ! మున్ను సైంధవ వధోద్యోగంబున, భీభత్సుండు "భీభత్సుండయ్యె"నని చెప్పుదురు, పెద్దలు. అయ్యది నేడుసాక్షాత్కరింపఁ జేసితివి. స్వామీ! ధన్యులము ధన్యులము.

పెద్దిరాజు—మిత్రులారా! ఇదియంతయు, మీ దయావిశేషమే దీనికింతపొగడ్తయేల? ప్రాణములం దాసవీడి రణక్షేత్రమ్మునం జొరబడిన, సామాన్య భటుండును ప్రశంసనీయుఁడే. (సభకైచూపుచు) ఇందెవ్వ రెవ్వతికి తీసిపోయెదరు చూడుడు...

సీ॥ కాలుదండము వోలు ✱ వాలు కేల ధరించి
యరులఁ జెండిన వల్ల ✱ భ ప్రభుండు.
నిలవెట్టి పోతులఁ ✱ బలివెట్టినట్లు శా
త్రవులఁ గూల్చిన పోతు ✱ రాజవరుఁడు,
నాగుబాముట్లు వెం ✱ టాడి, విరోధుల
ద్రవ్చిన, యీ నాగ ✱ వర్మరాజు
గ్రుద్దుకొక్కని జంపి ✱ గుండెలు దీసిన,
యపరాంజనేయుఁడీ ✱ యాంజనేయుఁ
గీ॥ డతడితఁ డనంగనేల! శౌ ✱ ర్యైక ధనులు
నందఱందఱె; జగతి పే ✱ రందినారు,
తగుననుచు, వీరిమ్రోల నా ✱ బాగడు టెల్లఁ
జందురునిముందు దివిటి ప్ర ✱ శంస కాదె!

గంగురాజు—(పెద్దిరాజును గౌగిటబట్టి) యెంతమాటంటిరి! పితృపితామహులనుండి వచ్చుచున్న మా విరోధములు నేటికి మహాపురుషులరైన, మీమూలమున నంతమైనవని, చెప్పుటకెంతయు నుత్సాహ పడుచున్నాను. ఇందులకు నేను మీ కెంతయుఁ గృతజ్ఞుఁడను...

పెద్దిరాజు—ఇందులకేమిగాని, ... మిత్రమా! నిశ్చయముగా నీ జన్మయే ధన్యము... యేలయనిన,

గీ॥ క్షాత్రజన్మంబు, శాత్రవా ✱ క్రాంత సమర
జయ సమర్థంబె, సృష్టియా ✱ శయము కానఁ

దదను గుణముగఁ గల జీవితంబునెల్ల
వ్యయము సేయు, మీ జన్మ; ధన్యంబు కాదె!

[ఆకాశవాణి]

సత్యము...సత్యము... పెద్దిరాజా! నీవును యుద్ధమునకు సంసిద్ధుండ వగుము.

మ॥ అవిగో! పైబడ వచ్చుచున్నవి, సితాస్త్రానూన విద్యుల్లతా
నివహ ప్రాపిత, దుష్టశాత్రవ చమూనీలాభ్ర సందోహముల్
మిపుల్ కార్యము లాలసించిన, విషంబే, లెమ్ము నీ దోర్బలో
త్సవ మానాహుతిఁ, జెండుమింకఁ, బిడుగుల్ వర్షింప సీకుండగన్

ఓ గంగురాజాది మహాయోధులారా! లెండు! వాలకేతుండసంఖ్యాక సైన్య సహితుండయి ప్రళయకాల దావాగ్ని చందంబున, ఢీకొనవచ్చుచున్నాడు పరికర ప్రయుక్తులై లెండు త్వరపడుడు.

చ॥ గడియలలోన, సర్వము జగంబు మహాపద వార్ధిమున్గి పో
యెడు, సమయంబు లెండు! బిగియింపుడు, మీనడుముల్ సితాసిచే
నిడుదొలఁదీసి, ముందడుగు డీ భరతావనిఁ గల్గు దుష్టులన్
గడువడిఁ ద్రుంచి, శిష్టులనుఁ గాచి, జగద్ధిత మాచరింపుడీ!

[అందఱు నిర్ఘాంతపడి వినుచున్నారు]

నాగవర్మ—దక్షిణ దండయాత్రకేగిన వాలకేతుండెప్పుడు వచ్చెను?

వల్లభనాయడు—ఈతని యండఁజూచుకొనియే కదా వారిట్లు మిట్టిపడిరి, మనమును నారహాస్యమెఱింగియే నీదుర్మార్గుని, దక్షిణదండయాత్రకుఁబోనిచ్చి మదన కుంభిశుల మదమడంచితిమి.

గంగురాజు—రాజకీయంబున, నాగవర్మను మించినవారు కనుపించరు, ఇది యాతని యాలోచనయే కదా!

ఆంజనేయరాజు—మదన కుంభిశుల పరాజయమును వినియే, యిట్లేగుదెంచుచుండును

పోతురాజు—అయినను... ముంచుకొని పోయినదేమి!

గీ॥ వాలకేతుకాదిక మత్త వ్యాఘ్రు నైన,
గడకఁ గళ్యాణ దుర్గంపు గడప ద్రొక్కి
బ్రతికి పోనేర్చునే! యున్న వారలంత
పిఱికి పందలె! మగటిమిఁ బేరు గనరె!

రానిండు... వీరికిని మదనకుంభిశుల వ్రాతయే పట్టినది.

పుత్తమనాయడు—శేషన్న నీతనికిట్టి మిట్టిపాటెందుకు ?

గంగురాజు.—(దీనవదనుండయి) శాంత్యైక జీవనులరగు, మిమ్ము పనికిమాలిన కయ్యంబులకుఁ జొనిపి, శ్రమబెట్టుచున్న మా యీ మిత్రుని క్షమింపుడు.

ఉ॥ ఘోరరణావనిన్ మదనకుంభిశులన్ దెగటార్చి గెల్వఁగ
న్నారలు మొన్ననే! బడలినారలు, దానను మీరలెల్లరున్
"పోర" ను నిప్పుడీ పిడుగుఁ బోలిన పల్కుల గుండె వ్రీలెడున్
గోరగజాల, ఖిమ్మికను, గోరను నీ రణ భూమిఁ బోరగన్

పుత్తమనాయడు—మిత్రమా! దైవ సంకల్పితమ్ములగు నీ కయ్యమ్ములు పనికిమాలిన వెట్లగును? మీరలు మమ్మెట్లు శ్రమబెట్టుచున్నారు? ఇది మా విధి.

గీ॥ ఒక కుటుంబముఁ గాచుట కొక్క వ్యక్తి
నొక్క గ్రామంబుఁ బ్రోచుట కొక కుటుంబ
మొక్క కులమును, రక్షింప నొప్పు విడున
లోకమే! యను బుధుల పలుకులను వినమె

ఆంజనే—కరుణామయుండవగు నో గంగురాజాగ్రణీ !

చ॥ ఒక ఖలుడెవ్వడో! పదరి యుత్తమ రాజ్య పదభ్రష్టులన్
స్వకులుల నేమచుండ గని సైచుట కంతకు మానహీనపున్
మొకములమే! పవిత్రులరు మీరాదయ యుండినజాలు యుద్ధమీ
యొకటియె కాదు వేల్కొలదిఁ యుండినఁ బోరిజయంబుఁ గాంచమే

పెద్దిరాజు—(గంగురాజు నుద్దేశించి) మిత్రమా! గంగురాజా! వీరలన్నట్లు మన యీ మిత్రులెల్లరును మిమ్ము నీ సందిగ్ధ సమయంబున నసహాయుని గావిడచి పెట్టరు అదియును గాక.

గీ॥ అరులు జూదమ్ము నకును బో కె రాటములకు
బిలువఁ బోకుంట వెలితి -పై కె పెచ్చు రాజ
ధర్మము నకును, నది విరు కె ద్ధంబు సుమ్ము
తగును కయ్యంబు సేతయే? కె ధర్మమగుట

గంగురాజు—ప్రాణస్నేహితులారా! మీరాడిన, యీ ప్రోత్సాహవచనంబు లెంతయు నా మనంబు నలరించుచున్నవి. మీరుజూపిన, యీ సౌభ్రాతృతకు నేనా జన్మాంతముఁ గృతజ్ఞుండను. ఇప్పుడు కర్తవ్య మెద్దియో మీరే యోచించి, నన్నొక దరిఁ జేర్పుడు...

నాగవర్మ—కర్తవ్యమున కేమున్నది. మదనకుంభిసుల వధానంతరము, నీకళ్యాణ పురంబునకుం జేరిన, సర్వసైన్యంబులు సుమారు, ముప్పదిరెండు వేలుండునని, వినుచున్నాను. ఈ సేన,నెల్ల నడిపించుట కొక్క సమర్థుండగు సేనాని నేర్పాటు సేయుటయు, సమరమ్మున నామిత్రుల నుక్కడంచుటయుఁ గర్తవ్యంబులు.

వల్లభ —స్వామీ! దీనికింత యాలోచన యెందులకు, యెవని, నిర్వక్రభుజాబలంబున మదన కుంభిసుల మదమడంపఁ గలిగితిమో! అట్టి పెద్దిరాజ భూపాలుం డెదుటఁ గనఁబడు చుండ, సేనానికొరకు వెదుకవలయునా!

ఆంజనే—అవును! ముమ్మాటికిని సత్యము. అతడే జరుగఁబోవు భయంకరప్రధనమ్మున, సేననడుపంగల సేనాని; అతడే సమర్థుఁడు.

పోతురాజు—నిజము- నేనయ్యది బలపఱచుచున్నాను.

గంగురాజు—మిత్రమా! పెద్దిరాజేంద్రా! దైవేచ్ఛా కల్పితంబగు, నీ సంగ్రామంబున నీ సభ్యులెల్లరు, నీసర్వసైన్యాధి పత్యంబు నేకగ్రీవముగాఁ గోరుచున్నారు. ఆప్తుండనగు నాయభిలాషయు వారినేకీభవించినది...కాన భారత యుద్ధంబున, భీష్మునిం బోలి,

గీ॥ మిత్రుల హితమ్ముఁ గోరి య కె మేయ శక్తి
సర్వ సేనాధిపత్యంబు కె సరగ బూని,
నడుపుమా! సేన, దుష్ట సం కె హారమునకు,
నీకతన, సౌఖ్యపడు గాక కె లోకమెల్ల,

[పూలదండను, మెడలో వేయుచున్నాడు.]

[సభ్యులు జయజయారావములతో కరతాళధ్వనులు చేయుదురు]

పెద్దిరాజు—మిత్రులారా! భగవన్నిర్ణీతమగు, నేడేండ్లు, మిమ్ముంగలసి, కళ్యాణ పరమేశ్వరు నారాధింపుచు, వెళ్లబుచ్చితిని, గడవుగడచెనుగదా, జన్మభూమిని జూచుకొందుగదా యను నా తలంపు లిట్లుగా పరిణమించినవి- తానొకటిం దలంప దైవము మఱొక్కటి దలంచుననియెడు సామెత, నేడియ్యెడ నిజమయ్యె అయినను, క్షాత్రతేజుండగు రాజునకు సంతతము యుద్ధములే సంతోషదాయకమ్ములు. అందు మిత్రసంరక్షణార్థమై పోసంగిన, నీ సమరంబు మఱింత, యుత్సాహ జనకంబు మీకు నాయందుగల భ్రాతృప్రేమనుం జూపించుటకుంగాను, మీరీమహోన్నత పదవిని, నాకు ప్రాపింపం జేసితిరి, కాని, మఱేకారణంబునను కాదు. ఇందులకు మీకెంతయు నేను కృతజ్ఞుండను. నేను దీనిని, సమర్థించుకొనుటకు, ప్రయత్నింతుంగాక.

గంగు— మంత్రివరా! మీ తేగి పట్టణంబున, నీ శుభవార్తనుం జాటింపించి సర్వ సైన్యంబులం బ్రోత్సహింపంజేయుము. (చారణుని వైపు చూచి) చారణదేవా! శ్రీకృష్ణ భగవానుని జయగీత మొకమాఱు నీ సభాముఖంబునం బాడుము.

[చారణుఁడు]

(భక్తిశ్రద్ధలతో లేచి, కంఠము సవరించుకొనుచు)

గీ॥ అవ్యయంబై, యనంతమై యద్వితీయ,
మై, తనర్చిన నీదు, దివ్యాపతార,
మహిమ గొనియాడ నెవడు సమర్థుడయ్య
ద్వారకా వాస! శ్రీకృష్ణ వాసుదేవ!
పాప మతులకు నిలయమై భ్రష్టమైన!
భరత భూమి, నాబాల గోపాలము నటఁగ
లల కురుక్షేత్ర సంగ్రామమునం జొనిపి,
నెత్రు టేరులతోడ, పవిత్ర పరచి
సరగ నిలుపవె! ధర్మధ్వజంబుతోడ
"ధర్మమడఁగి యధర్మంబు దనరు నపుడు.

పుష్పస—(విని క్రోధముతో) ఓరోరీ! వృథావాచాటా!

ఉ॥ యుద్ధముసేయ రమ్మనుట యొప్పును, శాత్రవులన్ ముఖాముఖిన్
యుద్ధమునందు మార్కొని జయోన్నతిఁగాంచుట యొప్పు నంతెకా
కిద్ధర నిట్టులొళ్ళు పొగ తెక్కియుఁ గానక గాలుకూతలన్
బ్రోద్ధతిమై కలంచుదురె! యుత్తమ యాదవ వంశ రాజులన్

పెద్దిరాజు—(క్రోధముతో) ఓరీ! దురాత్మా! వాలకేతు?

శా॥ యేమీ! కన్నుల కావరంబు భుజ దర్పైక ప్రతాపప్రచం
డామేయ ప్రధనక్షమాక్షుభిత, ప్రోద్యద్వైరి వీర్యల్ యశ
స్కాముల్ నాసరి యోధయూథ భుజ నీ గంగుక్షమా పాలు నెం
తే మత్తాత్ముఁడ! తేటి చూడగలరా! నీబోటి పాపాత్మకుల్

[రణధర్మధ్వజమును చేతబట్టుకొని, వాలకేతు నుద్దేశించి.]

చ॥ నిలునిలు మోరి మూర్ఖ, యవి నీకుశ, నోరికి వచ్చినట్లుగా
బలికెదు, నోరుమూయుమిక భండన భూమికి వచ్చుచుంటి నీ
బలమును, నాబలంబుఁ గను పట్టెదు, రమ్మికఁ బోరి ప్రాణముల్
మెలకువ, నోడఁ గాచుకొను మీ! తెగనీల్గిన, లాభమున్నదే!

[ధ్వజ సహితుండయి క్రోధముతో నిష్క్రమించును.]

వల్లభనాయఁడు—(క్రోధావేశంబున) ఓరోరి! పాపాత్మా!

ఉ॥ దుర్మతివై దురాత్ములకుఁ దోడయి, ద్రోహము సేయజూతువే
ధర్మ మధర్మముల్ గనవె! ధారుణియంతయుఁ గొల్చుచోయెనే
నిర్మల శౌర్యధైర్య గణ నీయకుమారులఁ గోలుపోయియున్
మర్మ విదారితమ్ములగు మా విశిఖంబులు బాడవాతెనే!

యిదిగో! చచ్చితివి! కాచుకొమ్ము. [బాణము రువ్వుచు నిష్క్రమించును]

పోతురాజు—ఓరీ! దుర్జాతి! మదన కుంభిళులకు సాయముఁ జేయుటిదియే కాబోలు,?

సీ॥ పలువెత్తు తురకల నట్టికట్టి మెడవట్టి
తలవారి కుత్తుకల్ దలుగునాఁడు,
బండ మరాటీల దంను, గుండెలు వ్రచ్చి
నెత్తుటేఱుల ముంచి యెత్తునాఁడు,

2వ రంగము—అంతఃపురము.

[పెద్దమాదేవి వికలమనస్కయై కూరుచుండి యుండును]

హా! దైవమా! యేమి! యీ విపరీత సంఘటనము! నిన్నకదా జన్మభూమికిం జననిశ్చయించుకొంటిమి, దశమి రేపు, మఱొక్కరోజు, గడపిన మే మిందుండి దాటి యుందుమే; మఱల నీ భయంకరప్రధనంబున కెందులకీడ్చితివి. పరస్పర జయాభిలాషులై పోరుపట్లు నెవరి యదృష్టమెట్టిదో యెవ్వరుచెప్పగలరు, మొన్న జయించితిమి, నేడు మాత్రమేల జయింపరాదనుటకు కాలస్థితులెట్లుండునో! "ఓడలు బండ్లవును, బండ్లోడ"లగును, కాలపరివర్తనమే వీనికి కారణములు; క్షాత్రమనివార్యమే. అయినను కయ్యంబునకు, వియ్యంబునకు, సమతవలయునందురు పెద్దలు వాలకేతుండా ముష్కరుడు అందసంఖ్యాక సైన్య సహితుండయి, ప్రయత్నపూర్వకమ్ముగా దండయాత్ర కనివచ్చినవాడు మనవారా పోయిన మహా సంగ్రామంబునం, బోరి చచ్చిచెడి బయటపడినవారు వీరు! మిక్కిలి యలసి యప్రయత్నంబున, నున్న సమయంబున నాకస్మికమ్ముగా వచ్చి పైబడిన దుర్మార్గుల నెట్లుజయింపంగలరు! దుర్ఘటము... దుర్ఘటము... వారివీరికి "హస్తిమశకాంతరము, (భర్తనుద్దేశించి) నాథా! కొంచెమాలోచింపవలదా మిత్రవాత్సల్యముండకూడదని యెవరందురు! ఉండనగును, ముమ్మాటికి నుండవలయును కాని సమంజసాసమంజసములం దలపోయవలదా! చూడుడు! దుర్జయులగు క్షాత్రవులకు, మహేంద్రుడంతటివాడు వినతుండై దుస్థితులఁ దప్పించుకొనలేదా! హా! పరమేశ్వరా! నీ యాజ్ఞాబద్ధులమును, నీ భక్తులము నగు మమ్మెట్టులీ విపత్సముద్రమును దాటింతువో! తీసికొనవచ్చినవాడవు మమ్మాశీర్వదించి మా బిడ్డలతో మా జన్మభూమి కంపుము స్వామీ! ...క్రోధోద్రేకంబుననో! వ్యవధిలేకనో! మన్నాథుండు చూడనైన రాలేదు. యోధులెల్లరు సభాభవనంబునుండియే యుద్ధమున కరిగిరని వినుచున్నాను- అబ్బా! క్షాత్రమెంత నిరాశాబద్ధము... (నిట్టూర్పుంబుచ్చుచు) ...యుద్ధ విశేషమెట్లుండునో, తెలియబడకుండె; అదియేమియో కాని నా మనంబనేక విధంబులం బోవుచున్నది. శకునంబులును, వ్యత్యస్తంబులయ్యెడు... పర్యవసానమెట్లుండునో ఇంతవరకు దనివార్లు పాఠశాలకేగిన, బిడ్డలింకను రారైరి కారణమేమో! (చూచి సంతోషముతో) అదుగో! వచ్చుచున్నారు. (ముందునకేగుచున్నది)

కాటమరాజు } అమ్మా! నమస్కారములు [పుస్తకములుక్రింద పెట్టి నమస్కరింతురు]
పాపమాంబ }

పెద్ద— [కాటమరాజు నుద్దేశించి] చిరంజీవో భవా! [ఆశీర్వదించి పాపమాంబ నుద్దేశించి] సుమంగళీభవా! [ఆశీర్వదించును.]

కాటమ —[ఆతురతతో] అమ్మా! నాయనగారేరి! యెక్కడి కేగిరి. బహుమానము లివిగో! చూపింపవలయును. ఇవిఅమ్మాయివి, యివినావి (అనిచూపించును)

పెద్ద— యేమి బహుమానములు నాయనా! అవి!

కాటమ—మా పాఠశాలలో నేడు పోటీయాటలు జరిగినవి. [బహుమాన పతకమును జూపుచు] ఇదిగో! ఇది బహుమానపతకము. కత్తిసామునందు ప్రథమ బహుమానము [మరియొకటి జూపుచు] ఇయ్యదిపరుగెత్తుట యందు గెల చితిని. ఇదిగో! (మరియొకటిజూపుచు) ఇయ్యది మూడవది. పఠనమునం దొసంగబడినది

పెద్ద— (పాపమాంబ నుద్దేశించి) తల్లీ! నీ బహుమానము లేవమ్మా!

పాపమాం—మా తరగతి కొక్కటే బహుమాన మిచ్చిరి పాటలయందు నాకేయాబహు మానము వచ్చినది.

పెద్ద— తరువాత మాట్లాడుకొందము కాని రండి, (జాలికరముగా) చిట్టిబొజ్జల కాకలివేయుటలేదా! అన్నము పెట్టెదను-ఇంతలో నాయనగారు వత్తురు

కాటమ—అమ్మా! నాకింకను ఆకలి వేయుటలేదు. పంతులుగారు, పండ్లు, మిఠాయి పెట్టిరి కడుపునిండ భుజించితిమి।

పాపమాం—అమ్మా! నాకున్నూ!

పరిచారిక [ప్రవేశించి]

దేవిగారు! యుద్ధభూమినుండి కరండకుడు వచ్చియున్నాడు

పెద్ద— (ఆతురతతో) త్వరగా ప్రవేశపెట్టుము

కాటమ—(తల్లినుద్దేశించి) యేమి! నాయనగారు యుద్ధభూమికేగిరా! యుద్ధరంగ మెంతదూరముండునమ్మా!

పెద్ద— అవును నాయనా! వాలకేతురాజు దండెత్తివచ్చిన, నతని నెదిరింప మన వారందరేగిరి.

కాటమ—అట్లయిన నేనును వెళ్లెద. [వెళ్లబోవును]

పెద్ద— (పట్టుకొని) నాయనా! యీ యాగడములు మానుము. కరండకుడు వచ్చు చున్నాడు. యుద్ధవిశేషంబులు, దెలిసికొందముండుము (కూర్చుండబెట్టును)

కరండకుడు—[ప్రవేశించి]

దేవిగారికభివాదములు. (నమస్కరించుచున్నాడు)

పెద్ద— కరండకా! యేమి! యుద్ధవిశేషంబులు! మీ సేనాని, సేనలెట్లు, నడ పించెను...

కరండ—తల్లీ! ఆ సందేహము యించుకంతయు లేదు. తన్ను వెంబడించిన, మన ముప్పది రెండు వేల సైనికులను, నా యా దండనాయకులను విభజించి, విచిత్రవ్యూహంబులుగా నడిపించుచు, మహాసముద్రంబును, బోలి ఘూర్ణిల్లు నా శత్రుసైన్యంబులం దార్కొనియె. మన యాదవ సైనికులును, నాగవర్మాది మహానాయకులును, సైన్యంబులను, ధైర్యవచనంబులం బ్రోత్సహింపుచుఁ గయ్యంబునకుం గాలుపడిరి.

పెద్ద— తరువాత!

కరండ—తరువాత! తల్లీ మనవారు వీరావేశంబున నురుములవలె, బొబ్బరించుచుఁ శరంబులం బేయుచు నిశాతఖడ్గంబుల ఝళిపించుచు, డాలులకు ద్రిప్పుచు నీటెలం గ్రుమ్ముచు, గుఱ్ఱంబుల నుఱికించుచు, బాకాలూదుచు భేరీలు మ్రోయించుచుఁ, బ్రచండకోలాహలమ్ము గావించుచు నెమ్మి యుద్ధంబునకుం దొడంగిరి కత్తుల తళతళలు ప్రేక్షకుల కన్నులకు మిఱుమిట్లుఁగొలుపుచుండఁ టక్కుటక్కున ఖడ్గముల తాకుడులు, వినవచ్చుచుండెను.

కాటమ—(ఆనందముతో) బళే! తరువాత!

కరండ—[విచారముతో] మహాకాయులును మహాబలులును మహోత్సాహులును నగు సమరాంగణ రంగంబుల నారితేరిన, యక్కటకటా తురకల యసంఖ్యాకసైన్యంబుల సమ్ముఖమున, మనస్వల్పసైన్యంబుల నిల్చి పంపించుట దైవేచ్ఛ కాబోలు...

పెద్ద—(దుఃఖముతో కన్నులుమూసికొని) హా! పాపము. పాపము, యెంతశౌర్య ధైర్యసత్వసంపన్నులైన నేమి! పదిమంది యేకమైనప్పుడు ... ఇందుచేతనే "రాజ్యాంతే నరకం ధ్రువంబ"ందురు. హా! దైవమా! [మౌనము వహించును]

కాటమ—[తొందరతో] మా జనిన ముందుగు మా నాయనగారప్పుడేమొందుండిరి?

కరండ—కుమారా! ఏమని చెప్పుదుఁ, దనయనివార్య బాహుబల మహాంభోరాశి, నిజాద్వితీయ తీక్ష్ణ నిశిత ధారా తరంగ సంఘట్టనమ్మున బలనాకానికాయమ్ముల ముంచివైచుచున్న నాయనగారికి పరాజయ ప్రవార్తమ్ముల విని, తలనెత్తి యట్టె చూచిరి

కాటమ—(పులకిత దేహుండయి) తరువాత! తరువాత!

కరండ—తరువాత! తండ్రీ! మహాసముద్రమ్మునుండి బయలువెడలు, ప్రళయకాల బడబానలంబు చందంబున, మొగమ్ము జేవురింపఁ గన్నుల నిప్పుకణంబులురాల శాత్రవుల గుండెలు బెదురువడ, భూనభోంతరాళమ్ములు ప్రతిధ్వనులీన ప్రచండహుంకారమ్ములం జనుదెంచి శత్రుసైన్యంపు మధ్యభాగమున దిగిపోయింప

మొదలిడియె,

కాటమరాజు
పెద్దమా } —(సంతోషముతో) తరువాత !

కరండ—అమ్మా! నాయనగారట్లు కర్యంబునం జొరబడి, "మూర్తీభవించిన యముఁడో"యన్నట్లు తురుష్క బలంబుల ఛిన్న భిన్నంబు గావర్చుచు, వేదండంబుల తుండంబులు ఖండింపుచు గుఱ్ఱంబుల మోదుచు, నిదియది యననేల తన కడ్డువచ్చిన, చతుర్విధ సైన్యంబుల యుద్ధరంగంబునకు బలివెట్టుచు విహరింపం దొడంగిరి.

కాటమ—(సంతోషముతో నెగురుచు) తరువాత !

కరండ—కుమారా ! అంత నా భయంకర దృశ్యంబునకా పరసైన్యంబులట్టె, నిశ్చాంతపడి శూన్యభావంబులం జూచుచుండుటయు, నాయనగారు విజృంభించుటయుం గనుంగొని, రణోద్దండుండగు వల్లభనాయుడును, అపరాంజనేయుండగు నాంజనేయరాజున్నా చెలరేగి, లేళ్లగుంపుపం గుమురు సింహకిశోరంబుల, చందంబున, శత్రుసైన్య మధ్యంబునం దుమికిరి.

కాటమ—తరువాత,

కరండ—అయ్యది చూచి, నాగవర్మయు, పోతురాజు మొదలగు మహానాయకులు, మోసలను ధీకొనుచు, నొకరివెంట, నొక్కరుగా, రణరంగంబున, శత్రువరూధినీ సముదయంబు నుఱుమాడుచు, ప్రవేశించిరి.

కాటమ—(సంతోషముతో నెగురుచు) కరండకా ! తరువాత !

కరండ—తండ్రీ! యేమిచెప్పుదును, యుద్ధము కడుభీభత్సముగానుండెను, ప్రచండమార్తాండుండును గగనమధ్యంబున, నుండి తన ప్రచండకిరణంబుల, బ్రసరింపుచుండెను. వాలకేతుని పక్షమ్మునం గల సైన్యంబులు, సంఖ్యంబోను, బలంబునను, శౌర్యమునందును, వెనకంజవేయుచుండెను. యాశ్చర్య మేమంటె మనవారి పక్షమున పనిచేయుచున్నదని, మాయలమారిత్వాసా వనవమ్ముల మనవారి కుసిగొలుపుచుండిరి.

కాటమ—బలే ! బలే !! యనంతరము,

కరండ—(భయముతో) తండ్రీ ! యేమనిచెప్పుదు (గుండెలు తడుముకొనుచు) నల్లీ! యిప్పటికి, నా గుండె దడ......పోలేదు.

పెద్దమా—(ఆతురతతో) యేమంత భయపడితివి. కరండకా! చెప్పుము-చెప్పుము,

కరండ—పదఘట్టనమ్ములచే భూమి గ్రక్కదల నభంబు ఘూర్ణిల్ల దిశాగజమ్ములు భీతిలునాఱ దొడలం జఱుచుకొనుచు, భుజాస్ఫాలనంబు గావర్చుచు, సేయం

కగ ముఖగహ్వరంబున, హోరున వెలువడు "ఓరోరీ! యాదవపాంసనా"
[సంశయసూచకముగా నాలుకఁ గఱచుకొనుచున్నాడు)

పెద్దమా—కరండకా? యేలసంశయించెదవు! "విరోధి"యన్నమాటలుగదా? ...

కరండ—అవును తల్లీ! "ఇంతటుకట్టిపెట్టుము" పశుప్రాయులగు వీకలీ "లోకభయంకరుండగు వాలకేతున కీడుకార"మ న్యాయముంబున, నాలుకొన్నందులకా "ప్రతిమించి రాగమున బడి"నదే! "మూఢుడు" "కాచుకొనుడు" అను వాట్టహాసవచనమ్ములు వినంబడియె...మనవారును, చెవులు "కింగురు"మన నివ్వెఱపడి, యాసవ్వడి వచ్చిన దిక్కునకై తెల్లపోయి, చూచుచుండిరి.

పెద్దమా—(భయముతో) మనేదిసో విపత్తు దాపుచున్నట్లున్నదే! కరండకా! ఆపైని నేమిజరిగినది.

కరండ—అమ్మా! అప్పుడుగుంబోలిన, యయ్యులివు ననుసరించి, భయంకరాకారుండును, మేరుశైలశిఖరోపము, గదాహస్తుండునుఁ, గర్కశస్వరుండును, నగు నొక్క ప్రత్యక్షరాక్షస స్వరూపుండు సాక్షాత్కరించె

పెద్దమా—(భయముతో) అతడేకాబోలు లోకభయంకరుండగు వాలకేతురాజు!

కాటమ—(ధైర్యముతో ముందునకువచ్చి) అయిననేమి! తరువాత!

కరండ—(కాటమరాజును మెచ్చుకొనుచు) కుమారా! మీ శౌర్యమనివార్యము... (పెద్దమాదేవినుద్దేశించి) తల్లీ! భయజనకం బట్లువచ్చిన యా వేషధారి గదామాత్ర సహాయుండయి, బులగు బొబ్బలువెట్టుచు, నపరమృత్యువై, మనసైన్యంబులపైబడి వెఱ్ఱికేకలు వైచుచు, బశువులం ద్రోలినైచినట్లు ద్రోలివైచెను,

కాటమ—[క్రోధోద్రేకంబున, వాలకేతునుద్దేశించి] ఓగోరి దురాత్మా! యేమి!

చ॥ పరగజ సింహుడార్త పరి పాలనశీలుఁడు, నాపితాద్రి సం
గర భరమూని, సేనలనుఁ గాచుచునుండగ, నించుకేనియుఁ
వెరపు వహింపకే; యెదుట నిల్చితివే! పయిపెచ్చు సేనలన్
దలిమితినంట; శ్రో: బ్రతికి నాడవు నేనట లేకపోవుటన్

(కరండకు నుద్దేశించి)కరండకా! తరువాత!

కరండ—అంత నాయనగారి విపరీతపరిణామమును, దిలకించి, చెల్లాచెదరై, యున్న సైన్యంబుల కూడదీసి యుసికొల్పుచు, నవ్వాలకేతువుం దార్కొనియె

కాటమ—తరువాత!

కరండ—తండ్రీ! యొండొరులట్లు దార్కొని పరస్పర జయకాంక్షులై మహాదారుణం బుగా, శిరంబులఁ దాఁకొనుచు, బాహువులఁ బట్టుచు, ముష్టులఁ బొడుచు కొనుచు గోలులఁ దరుక్కొనుచు, బోరుసల్పుచుండిరి ఆభయంకరమగు నాయుభయుల ద్వంద్వయుద్ధమ్ము నీక్షించి, యుభయసైన్యంబులు విశ్చేష్టితులై చూడసాగిరి.

కాటమ—నాయనగారి పరాక్రమ మద్వితీయము. తరువాత...

కరండ—కుమారా! అవును...అంతట నావీర్యకాయుండగు నవ్వాలకేతుండు పెద్దిరాజభూపాలుని నట్టె, తనరెండు చేతులను, బట్టి ఓరీమూర్ఖా; యుద్ధభూమియన్న పశువుల మేపుకొనుగడ్డిబీడనుకొంటివా! యేమి! ఈదెబ్బకు భూమిపైబడి సహస్రోప సహస్ర శకలమ్ములగు నీతల నెవ్వరింగు రక్షింపఁగలరో! చూతుంగాక' యనుచు, విసరి నేలకుఁ గొట్టెను.

పెద్దమా—[దుఃఖోద్రేకంబున] హా! నాధా! [మూర్ఛిల్లును]

కాటమరాజు<br>పాపమాంబ }—[దుఃఖోద్రేకంబున] హా! తండ్రీ! [మూర్ఛిల్లును.]

కరండ—(ఆతురతతో) అమ్మా నామాటలు పూర్తి కానిదే మీరట్లు భయపడెదరేమి?

కాటమ—(దుఃఖముతో) ఓరీ! కరండకా! వినవలసిన మాటలింకేమున్నవి.

కరండ—కుమారా! సామునందాటి తేటీన, యమ్మహా మహుండొక్క ముక్కడిచే, నుక్కుచెడి, జిక్కననుకొంటిరా.

పెద్దమా—(ఆతురతతో) యేమి! యేమైనది.

కరండ—తల్లీ? అట్లు జరుగునని యూహించి యుండిన, నాయన గారయ్యదనెఱింగి, చివుక్కన గరుడునివలె పైకొక పల్లటీ కొట్టి తిరిగివచ్చి తన చరణద్వయంబున, నాదుశ్చరితు శిరంబున నొక్కతన్ను తన్నుటయు,...కన్నులు జిగేలుమన, మోకాళ్లు మూలెడు నేలను పాదుకొని పోగా లోమ్ములవిసి వెన్ను విఱిగి, మాటరాక, తన్నుకొని, భూమిపైబడిపోయెను.

పాపమాం—[లేచి ముందుకు వచ్చి] చావు దుర్మార్గుడా! చావు-

పెద్దమా—నాయనా! కరండకా! సంతోషవార్తను దెల్పిన నీకు శుభంబగుఁగాక ఈ హారమును దీసికొనుము [మెడనున్న హారమును తీసియిచ్చుచున్నది.]

కరండ—[హారముకు గ్రహించి] తల్లీ! అన్న రాధముండుక్కుచెడి నేలంబడిన, జూచి పరబలంబులు కాలుకొలంది దిక్కులంజూచుచున్నవి. యాదవులు మోదంబున, "పెద్దిరాజ భూపాలునికి జేయ్" అను జయజయారావములతో

భూమ్యాకాశంబులనింపి వైచుచుండిరి. నేనట్లు యుద్ధము ముగియుటఁ జూచి, యీ శుభవార్తను మీ కెఱింగింప బరుగిడి వచ్చితిని...

పెద్దమా — నాయనా! కరండకా! ఇఁక నీవేగుము. చాలశ్రమ జెందితివి...

కరండ — చిత్తము. [నమస్కరించి నిష్క్రమించును.]

పెద్దమా — విజయావహుండగు మన్నాథు నెదుర్కొన నా మనంబెంతయుఁ గుతూహల పడుచున్నది. (పీఠమునందుండి లేచి కన్నదురుటను సూచించి) యేమి! ఈ యశుభసూచకముగు నా యీ కుడికన్నదరుచున్నది [తెరలోఁజూచి] చేటీ! పూజాద్రవ్యంబులను నిటుతీసికొనిరమ్ము.

చేటి — [పళ్లెరమున పూజాద్రవ్యముల నుంచుకొని] తల్లీ! యివిగో!

పెద్దమా — (అందుకొని) మన్నాథుండింకను రాకుండె నేమి! యుద్ధము ముగిసిన పిదప నింతయాలసింతురా! వచ్చుచుండిరేమో!

[ద్వారము సమీపించి చూడఁబోవుచున్నది.]

[తెరలో]

ఉ॥ ఓరి నరాధమాధమ! రణోర్విని జచ్చితివంచు, నొచ్చి, యే
మాఱిన పెద్దిరాజునిటనే మాయురె! మాయమొనర్చి, పేర్చి, జో
రా! రణధర్మ మించుకయునే నాత్మఁదలంపకఁ గొల్చిచాపి, చ్చే,
శూరుడకావె! ధర్మములఁనే జూడవె! మోడవె! యప్రతిష్ఠకున్

పెద్దమా — (విని చేతిలోనున్న పళ్లెరము జారవిడచి) హా! నాథా! (దుఃఖో ద్రేకమ్మున మూర్ఛిల్లుచున్నది) ...

కాటమ / పాపమా — [దుఃఖోద్రేకమ్మున] హా! తండ్రీ! [మూర్ఛిల్లుచున్నారు].

[పరిచారికలువచ్చి పరిచర్యలు చేయుచుందురు]

పెద్దమా — (మూర్ఛదేరి దుఃఖముతో) హా! ప్రాణేశ్వరా!

ఉ॥ హా! యమునాశనిరథి నినాకర! హా! శ్రితరక్షణైక దీ
క్షాయతబాహ! హా గుణగణాంచిత, హా కరుణాలవాల; నన్
మిమ్మా యటవీ స్థలిన్ విడచి నెయ్యెచ్చటికేగితివయ్యొ, వేగరా
వే; యిలదిక్కుమాలి, విలపించెను, మాగతి, జూచిపోవనే

పెద్దమా—(స్మృతి నభినయించి వెనుకగావచ్చి కుమారుని బట్టుకొని) తండ్రీ! యేమి యీయుద్రేకము! (బట్టుకొనును)

కాటమ—(విడిపించుకొనుచు) తల్లీ? నన్నిప్పు డాపకుము, ఆశీర్వాద పురస్సరంబుగా, నన్నని కంపుము.

గీ॥ యెవడు తన సద్గుణములచే నెల్ల దెసల
తిరముగా నుండు సత్కీర్తి మెరయఁ జేసె
నాపవిత్రుని నాతండ్రి నంటి నట్టి
పాపి తలగొట్టి తెత్తు సీ పాద మాన

సందేహింపకుము-లెమ్మ. "ఆలస్య మమృతం విషం"బను నార్యోక్తిని దలంపుము. నీ యీ ముద్దుబిడ్డ శౌర్య ధైర్యములఁ బరీక్షించు తరుణము పోగొట్టుకొనకుము. తల్లీ విడువుము. నన్ను పోనిమ్మ!

పెద్దమా—తండ్రీ! యివియేటి మాటలు. ఒకచెంప గొట్టిన, పాలు, నొక చెంప గొట్టిన, నెత్తురును వచ్చు పసిపాపవు నీవు? భయంకర ప్రధనమ్ముల గడి దేఱిన, దుర్మార్గుల పైకెఁ బోరాడ బోవుట యా! ఇదియొకటి వెట్టి నన్ను చంపకుము.

కాటమ—అమ్మా! బాలుండ ననియా! నీసంశయము!

సీ॥ బలి నతఁ పాతాళ భాగంబునకుఁ ద్రొక్కి
యెలరారు వామనుఁ డెంత వాఁడు
కార్తవీర్యుని, భుజ స్కంధముల్ నఱికి పే
రెనయు పరశు రాముఁ డెంత వాఁడు
గాధేయు జన్నంబు గాచిన తాటకిఁ
జంపు శ్రీరఘురాముఁ డెంత వాఁడు
కంసాది రాక్షస గణము గూల్చెడు నాఁడు
నిలలోన శ్రీకృష్ణుఁ డెంత వాఁడు

గీ॥ తల్లి! శౌర్య ప్రధాన స్వ ధర్మ నిరతు
లైన, ప్రాణుల కెందును నవని లోన
చిన్న పెద్ద తనంబుల నెన్న నేల
సింగపుఁ గూన యేనుఁగుల గొంగ కాదె!
కావున దీనికింత యడల వలసిన పనిలేదు.

పెద్దమా — తండ్రీ! యేమి! యీ దుడుకుతనము.

సీ॥ "క్రోడి" వారల తోడఁ గూడి యాడెదు నీవు
యరులతో నెట్లు పో రాడ గలవు
మోహనంబైన నీ మురిపెంపు నెమ్మేను
బరుశరంబుల కెట్లు పరుషఁ గలవు
కల్యాణ పరమేశు కరుణచేఁ గలిగిన,
యేకపుత్రుని నని కెట్లు పంతు
"కనఁడా"యె. మా కష్ట కాలంబు దైవంబు
విషము శరీకుల వెతల వెట్టి
గీ॥ "నాథ! నామక్రియా" మన్నొ సాధనముల
నీ సపర్యల మునిగి ధ్యాం తిలెదు నేను
"బ్రదుక" నీ యీ కుమారుని ప్రధన కుశుక,
'మగసినను' నెట్టి యానంద మంది యుందొ.

కాటమ — తల్లీ! యేల నీ వెట్లు దుఃఖించెదవు. యీరగడిల్లము-రణరంగంబున కెప్పుడు నాయనగారేగిరో! జయాపజయమ్ములు, మోదఖేదమ్ము లప్పుడే నిర్ణయింప బడినవి. యుద్ధరంగమ్మున, కుతికిన, శూరుండు విరోధులను జంపుటయ్యో, లేక చచ్చుటయో సహజంబులు, ఇందు వింతయేమున్నది, తన క్షాత్ర స్ఫూర్తిఁ జూపి, విధినిర్ణయంబుఁ జొప్పున, వీరస్వర్గంబు నలంకరించిన పుణ్యాత్ముని, నీ దుఃఖాశ్రుబిందువులచే పంకిలునిఁ జేయకుము తల్లీ! (కన్నుల నీరమును దుడిచి) వీరపత్నివైన, నీవు నీ యీ బిడ్డను నుత్సాహంబున, రణరంగంబున కనిపి, వీరమాతవగుము, చింతవిడువుము. ఇదిగో! [పరశువును

హా! నాథా! మమ్ము విడచితివా! మాగతి యేమిచెప్పితివి, నీ యీచిన్ని ముద్దుబిడ్డలను, మఱచితివా! బిడ్డలు బిడ్డలని పలువరించినంత కాలమేని, నీ పూర్వపుణ్య ఫలంబులను, నీ ప్రేమైక ధనంబులను, నీ ముద్దుబిడ్డలను, కన్నులార గని ముచ్చటించు కొను, భాగ్యము నోచలేదా! హా! మనోహరా! మీరాచరించిన ధర్మంబులేమైనవి. మీచే మ్రొక్కులందిన, దేవతలందఱెందేగిరి? నీ యన్యాయంపు మృత్యువును! నీ యకాల మృత్యువునకు- నొక్కఁడేని, నడ్డుపడకపోయెరా! హా! జీవితేశ్వరా! పరమపుణ్యాత్ములైన, మిమ్మీ యపమృత్యువెట్లు చెనకగల్గినది. హా! మాకిక, దిక్కెవ్వరు! మమ్మురక్షించువారెవ్వఱు! మాగతి జూచువారెవ్వఱు- మమ్ముబిలుచు వారెవ్వరు నీ యీ యనుంగు బిడ్డల ముద్దు ముచ్చటలను దీర్చువారెవ్వరు హా! పరోపకారపారీణా! హా! మిత్రకార్యార్థ పరిత్యక్తజీవనా! హా! కళ్యాణ పరమేశ్వర పదాంబుజ కైంకర్య ధుర్య! హా! నాథా! రక్షింపుము, మమ్మురక్షింపుము, (తిరిగి మూర్ఛిల్లుచున్నది.)

కాటమ—(మూర్ఛదేరి) హా! తండ్రీ! కుమారవత్సలా!

గీ॥ వచ్చినంతనె, కౌఁగిళ్ళఁ । గ్రుచ్చియెత్తి
ప్రణయపూర్ణ పవిత్ర సం । భావనముల
ముద్దుముచ్చటలను దీర్చి । ప్రోచుతండ్రి!
యింకనీవలె! యాడింతు । ఱెవరు నన్ను

అనేక కష్టములకోర్చి కనిపెంచిన మీకు నేనింత సేవజేయ నోచనైతినా! తండ్రీ! కాసేపునెడబాసి యుండని మీరు మమ్మెట్లు విడచియేగితిరి. పసిపాపలమైన మమ్ము జూడుము, మమ్మురక్షింపుము. (తిఱుగమూర్ఛిల్లుచున్నాఁడు.)

పాపమాం—(మూర్ఛదేఱి) హా! జనకా!

గీ॥ కడుపుననుఁ గాంచి పెంచి । సౌఖ్యములఁ జూచు
తండ్రి వగు నీవె! మమ్ములఁ । దలఁపకుండ
దిక్కుమాలిన, పక్షుల । తీరు విడచి
యేగి నను, నిక మాకు । దిక్కెవ్వరిచట

బాధ్యుండవగు నీవే మమ్మాదరింపని యెడల, యొరుల కేమిపట్టినది తండ్రీ! మేము నీకంత భారమైతిమా! హా! యింకేమున్నది.

(తిరిగి మూర్ఛిలుచున్నది)

పెద్దమా—(దుఃఖోద్రేకమ్మున) హా! నాథా! హా! పరగజసింహా! మీ కింతలోనే, నూరేండ్లు నిండెనా! సాలంకృత కన్యాదాన, ఫలమ్మున కువ్విళులూరితిరే! మీకర్తవ్యమును మఱచితిరా! స్వామీ! మీ కుమారుని యుద్ధ తులనేమి చూచితిరి. యేమి చెప్పితిరి.

సీ॥ కొడుకుఁ గోడలు భక్తి । నిడు సపర్యల నంది
యానందమున నోల । లాడ లేదు
సారె చీరెలు వెట్టి । సఖులతోడుతఁ గూతు
నత్తవారింటికి । ననుప లేదు
ఉభయ వంశముల క । భ్యుదయ కారణులైన
మనుమల గని యెత్తు । కొనగ లేదు
అనయమ్ము మీదర్శ । నాపేక్షచే నిరీ
క్షించు తెమ్ముల కోర్కె । నించ లేదు
గీ॥ విజిత సర్వావనీ నాథ । విమల మకుట
మణి విరాజిత చరణు నీ । యనుగు కొమరు
సుకృత సాంబ్రాజ్య పాలనఁ । జూడలేదు
నా మనోనాథ! సుగుణ స । నాథ! నాథ!

ఇంతలో నింత యన్యాయమా! హా! (మూర్ఛిల్లును.)

కాటమ—(స్మృతి నభినయించి యటు నిటు చూచి) యేమీ! ఈ దురంతము... నాకు మతిపోయినదా! యేమి! క్షత్రియునకు మరణము, రణంబున గాక మఱెందు. విరోధి యొనర్చిన యీపాప కార్యమునకుం బ్రతిక్రియ నూహింపక యనవలె నేడ్చు చుంటినా!......ఓ దుఃఖమా! నన్ను విడువుము (ఒరనుండి కత్తిదీసి వాలకేతు నుద్దేశించి) ఓరోరి! దుర్మదాంధా! వాలకేతు!

మ॥ రణ ధర్మంబుల వీడి, వెన్నొనుకగా । ప్రచ్ఛన్నతఁ గొట్టియు
జనదకుఁ జంపితివే! దురాత్మ; నిను నీ । సైన్య ప్రయుక్తంబుగా
వనధిఁ జొచ్చిన, వన్య శైలగుహలఁ । పర్తించినన్ వజ్రి వ
జ్రనిభంబైన మదీయ ఖడ్గ నిహతిఁ । శాసింతు నాలంబునన్

ఇందులకున్ దప్పితి నేని పితృపితామహుల పాదమ్ములకుం దప్పినవాడనగుదును, ఇదుగో యిప్పుడే వచ్చుచున్నాను కాచుకొనుము...... [వెళ్ళబోవుచున్నాడు]

చూపుచు] గంగాధర హస్తంబగు నీ పరశువు, నాచే నున్నంతవరకు, నీ కుమారున కాహవజయము నిస్సంశయము, నా యాధీనమ్మున నున్న యొంటికొమ్మ బొల్లిగూవు మాహాత్మ్యమును మఱచితివా! తల్లీ! యేలనన్ను నిరుత్సాహపరచి నిరోధించెదవు తప్పక సమరంబున, కేసరులయు, శాత్రవులం బటిమార్పవలయు ... అంతవరకును తల్లీ! నీ పాదములగూన, నే నిద్రాహారమ్ముల విసర్జించుచున్నాను. విడువుము ఆజ్ఞదయసేయుము. వీరమాత ననిపించుకొనుము! ఆ చంద్రార్కముగ నీకీర్తి నీ యవనిం బాడుకొలుపుము. లెమ్ము.

వేద్యవా—(తనలో) ఇప్పుడు నే నేమి చేయుదును, కుమారుని పట్టుదల యవారితము శ్రీకృష్ణాముల వలె, నీతడును పరులకజయ్యుడని నీతని మహాద్భుత కృత్యంబులె తెలుపుచున్నవి. దైవబల సంపద నితడు పరులను జయించు. నిస్సంశయము అభ్యంతర పెట్టిన, నికలాభము లేదు... పైన దైవమే యున్నాడు, [ప్రకాశముగా] ధన్యురాలను, తండ్రీ! ధన్యురాలను. నేనిప్పుడు కదా గంగా కుంతీత్యాది వీరమాతల యందు వలనెత్తుకొనం గలిగితిని, కుమారా! యుద్ధమున కుఱుకుము, శాత్రవులం బటిమార్పుము,.....[చేయినెత్తి]

గీ॥ యాదవాన్వయము పవిత్రకమైన దేవి,
ప్రాజనకు [illegible] ధర్మంబు కదప్పదేని,
నే పతివ్రతనేని, స [illegible] ర్వేశ్వరుండు,
కొడుక! నీవల్ల జయము చేకూర్చుంగాక.

రమ్ము! తండ్రీ! యుద్ధకవచంబుల ధరింపుము, [తోడుగం బోవుచున్నది.]

ఇది

శ్రీ సీతారామాంజనేయ కరుణాకటాక్ష ప్రలబ్ధ కవితా
శిల్ప ప్రవీణ, పాణ్ణాలవంశోద్భవ అన్నపూర్ణా
చిదంబరాచార్య శ్రేష్ఠ తనూభవ
సుబ్బరాయ నారాయణ
ప్రణీతంబైన
" కాం [illegible] ము రా జు "

అను

దృశ్యకావ్యంబునందు,
చతుర్థాంకము.

శ్రీ




పంచమాంకము.

---

1 వ రంగము — మార్గము.

[ వృద్ధకంచుకి ప్రవేశము ]

(పెద్దమాదేవి నుద్దేశించి) తల్లీ! యెంత నిర్దయవు! ఇట్టి దెబ్బనైన నుండునా? కొంచెమాలోచింపవలదా!

చ॥ అనయ మవధ్యపున్ వరము గలంది, భయంకరమైన పోరులన్
బెనగిన దుష్టశాత్రవులఁ జేకొనని, మార్కొనని; ముకుళహస్త లా
అని, పసికూన ముగ్గులఁ గోరుచు కుమారుని బాపుకొంటివే!
మనము నలక్షు పూసరము గమ్ముకు నగ్గివైవ, జూతువే!

తల్లీ! బిడ్డలు బిడ్డలని, నిద్రాహారమ్ములు మాని లెక్కలేని పెక్కు నోములు నోచి, యిల్లువాకిళ్లు విడచి, కాని దేశమ్ముల కలుదెంచి యెట్టులో పరమేశ్వరు కరుణావిశేషమ్మునఁ గలిగిన కులాంకురమ్మును నిహపరసౌఖ్య సాధకుని నేకపుత్రు నగ్నికంబున నంతపరిచేసితివి. నీ పుత్రప్రేమ యంతయు నేమైనది, తల్లీ!

సీ॥ శత్రుమర్దను, ముసలి. స్వర్గచ్యుతాదరంబును
గదనమునఁ గాంచి యెడలు గంగ గా భవాని,
సౌఖ్య సర్వస్వ సాధానుఁ గోజాతబిడ్డఁ
జన్నకంపెను నిను గన్న కన్గు పటపె!

బొనర్పలేకుండునా ? తప్పక యొనర్పంజాలుదు !... యొకవేళ నిరర్థకంబైన నయ్యది తత్కార్తవిశ్వాసహీనతయేయగును. మఱొండుకాదు... మహామహు లకే యట్టియూహాలు వారు తప్పకందు జయంబుగాంతురు. మహాత్ములకు మనస్సె ప్రాముఖ్యము, ... కుమారా ? నీ కార్యంబులందు విశ్వాసముంచి నడుపుము...తప్పక జయింతువు ! (భగవంతు నుద్దేశించి) ఓ భగవానుడా ! ధర్మసంరక్షణార్థమై కుమారుని, కృతకృత్యునిఁజేయుము మా యదృష్టము లను ఫలింపచిమ్ము...ఇదేమి యెంతనడచినను గమ్యస్థానము దూరమగుచున్నది. అవును, ముసలివాడనగు నన్ను కాలము "తాత" వరుసను నాడించుచున్నది. సత్వరమే యేగి, పునర్జీవితుండగు పెద్దిరాజభూపాలుని నవలోకింతుగాక— "నా విష్ణుఃపృథివీపతిః" అని పెద్దలు చెప్పుదురు. త్వగలో నడచెదగాక...

[త్వరలో నడచుచు నిష్క్రమించును]

[అ న ని కి దిం ప బ డు ను.]



2 వ రంగము — యుద్ధభూమి.

[కాటమరాజు యోధవేషంబున, పూజింపుచుండగా, బ్రాహ్మణులు వేదమంత్రంబు లుచ్చరింప పెద్దిరాజు భూశయన గతుండై యుండును.]

పెద్ది — (యొక వైపునకుఁ బొరలి క్రోధముతో) ఓరోరి! నరపశువా?

ఉ॥ ఏమరియున్న నా వెనుక నే! చనుదెంచి గదాభిఘాత మూ
ర్ఛా మహితాత్ముఁ జేసి, జయగౌరవములన్ జనఁ జూచుచుంటివే!
మానక శస్త్రసంహతిని మాన్యుని మున్నవరేని భీమ సం
గ్రామ తలంబునన్ బ్రతుకఁ గల్గిరటంచెట నేని వింటిరే!

మఱుఁగము? మఱొక్కమాఱు నా నిస్తుల క్షాత్రతేజంపు దక్షిణహస్త ఖడ్గధారా మాధుర్యమును చవిఁజూతువు కాక. నిలుము, నిలుము. [ముందడుగిడి,]

ఉ॥ ఓరి! దురాత్మ! నిల్వుము! రణోర్వి జయంబిటు లింతలోనె చే
కూరునె, గర్వమందకుము క్రూర! మదీయ మహాసిధారలన్
జేరఁగఁ బుత్తుఁగాల్పురికిఁ జెల్లెను బత్తెము నీకు భూమిపై
కాఱులు ప్రేలకింక నినుఁ గాచుకొనం గమకింపు మిత్రులన్

(ఖడ్గమును విసరఁబోవుచు, ముందున్న కుమారుని జూచి) ఏమి! నేనిప్పుడెందుంటిని. (చుట్టుపారఁజూచి) ఇయ్యది రణభూమికాదా? (కుమారుని జూచి) తండ్రీ! ఇందేల వచ్చితివి? ఈ వేషమేమి!

గీ॥ ఒక్కచో, నొక్కరూపున, నొక్కరీతిఁ
గనుపడరు మచ్చుమందాల గాంధ్రు, కటికి
రక్కసులు, వీరినమ్మకే వాక్కునప్పు
డాదగునె; కొంచెమాగిన రానె? నేను.

ఎంత తొందరపడితివి! తండ్రీ! (దగ్గరఁ బడియున్న గంగరాజును జూచి) మిత్రమా! ఏమది! నీవవశుండవై యుంటివి! [illegible] గాయపరుపఁబడగా! (ముందు జూచి) ఏది! మన నాయకుని ఏఁదీ! యీ వింత? (చేయెత్తి)

చ॥ నిలుము! నిలుండుము! యూదవ్రుల నిర్భయమందకు డీసు మద్భుజా
బల పరిరక్షితుల్ వెఱువ వచ్చునె! మృత్యువుడాగినంతఁ బో
గలుగునె, రాళ్ళఁగాగు మనఁ గెలుకు గాదే! కలకాలమెల్ల మీ
చలము బలమ్ముఁ జూపియు దిశావలయమ్ముఁ గీర్తి నింపదే!

(రెండు అడుగులు వైచి తలపట్టుకొని) యేమి! నాశిరోభారమ్మింత నొచ్చుచున్నది? (కట్టును తడుముచు) ఈ కట్టునుఁ గట్టినవారెవరు? నా తల యిట్లు పగిలియుండుటకుఁ గతంబేమి! (ఆలోచన నభినయించుచు) ఇది రణరంగమేనా! [పాఱజూచి] పరస్పరజయకాంక్షాయత్తచిత్తంబులం బోరాడు వాహినులేవి!... ఇదేమి! నాకన్నులు పచ్చనగుచున్నవి! అంధకారము-మహాంధకారము- అం-ధ-[మైకముగ్రమ్మిపడిపోవుచున్నాడు]

(బ్రాహ్మణులు మంత్రములను చదువుచున్నారు, గంగురాజు కాటమరాజు సపర్యలు చేయుచున్నారు.)

పెద్ది— [తిరిగి స్మృతినభినయించి నెమ్మదిగాలేచి అటునిటు జూచుచున్నాడు]

గంగు—(పెద్దిరాజునుజూచి) స్వామీ! బాధయెట్లున్నది. కొంచెము దాహమిత్తునా! [నీరముల నివ్వబోవుచున్నాడు]

పెద్ది—(చేతితో వద్దని చెప్పుచున్నాడు)

గంగు—(విచారము నభినయించుచు) మిత్రసంగతకుఁ జార్థమై చనుదెంచిన, మీకిట్టి యిక్కట్టులు చుట్టుకొనియె! దైవహతులమగు మాబోటి మందభాగ్యులకు సహాయముసేయుట దైవాజ్ఞయమ్ము కాదు కాబోలు! పోనీ...

మ॥ ఎదియెట్లున్నను, మిమ్ముఁ జూచుకొనన న్నెయ్యేది మాకు, ప్రాణప్రతి.
ష్ఠదగన్ జేసిన. నీకుమారకుని! వినిశ్వాసంబునన్ సద్గుణా
స్పద సాధ్వీమణి, పెద్దమాంబ గళ్ళసుంభ చమ్మాత్ర సంపత్తి మా.
కది యేచాలును, నింతధన్యులము సుమ్మా! పెద్దిరాజాగ్రణీ!

పెద్ది— (ఆశ్చర్యముతోలేచి) మిత్రమా! యేమంటివి. నేనోకపలికచ్చితినా! పునఃప్రాణప్రతిష్టయా!...అదియెట్లు! కుమారుని సహాయ కార్య విశ్వాసమ్మనవా! ధన్యుడను...ధన్యుడను...(కుమారునిదరి జేర్చుకొని) కుమారా! ధన్యుడను. నీ పితృభక్తికిచాల నాడెందమానంద మందుచున్నది...తండ్రీ! నీకార్యమ్మమోఘము- కానీ నాయెడమాత్రము నింద్యము యేలయందువా!

మ॥ రణరంగంబున, క్షాత్రతేజము, కరాస్త్రప్రద్యుతుల్ వైరివీ
క్షణపంక్తిన్ మిఱుమిట్లుఁగొల్ప విహరించన్ జాలు సుక్షత్రియుల్
రణమున్ జొచ్చి విరోధి ద్రవ్పుటయొ! వీరస్వర్గ సౌభాగ్యమున్
గనుటో! కావలె నంతెకాని యసుభిక్షుం బెత్తుగాఁ జెల్లునే.

అట్టి వాకీరస్వర్గసౌభాగ్యస్వీకృతి కంతరాయం బొనగూర్చిన, నిప్పని గడుంగడు నింద్యము...తండ్రీ?

కం॥ యవనవంశ క్షత్రియులై
కదనంబున, వెనుక కనుగుఁ గదిపిరె పెద్దల్
ఎది! యెచట నట్లువిరుటయొ,
మొదవిన, నచియింపు లెక్కఁ గొక్కని నేర్పన్

అదియును కాక, కుమారా!

సీ॥ క్షాత్ర ధర్మమ్మున, నిరంకుశ స్వప్రకాశ
భావపూరిత వంశ ప్రవర్ధమాన,
బుద్ధి కుశలుల కడుపునఁ బుట్టి పెఱుగు
నీకు నీయూహ లెట్టుల నేర్చెనయ్య!

పునఃప్రాణప్రతిష్ఠ నీ పితృసమ్మతమనుకొంటివి కాబోలు! పోనీ!... యీ కార్యమ్మున, నీ తండ్రిని, చిరస్థాయిగాఁ జేయఁగలవా!...అయ్యారె ప్రకృతి స్వభావమా! భగవదుద్దేశమా! ...ఏదియుఁ గాదే! తండ్రీ! మఱెందుల కింత ప్రయాసము ... జాలితేని

గీ॥ నిజభుజ పరాక్రమంబున నిఖిల క్షాత్ర
వానల నణఁచి, పరశురాము మానాలట్ల
శత్రు రుధిర ధారలను పితౄ తర్పణమ్ము
సలుపుమా! మహా మానవులు సంతసింపఁ

నే చెప్పిన యీ కార్యముచేత, మనవంశమందున నేడేడు పద్నాల్గు తరంబులవారును దనిసియుండురు అయ్యారె ధర్మంబు ... నాయనా! బాలుండ వగుట క్షాత్రధర్మంబు లెఱుంగవు, నిజముగా నిందు బొగఁబడితివి...

కం॥ పరస్వర్గ సుఖంబులఁ
జూఁగిన నెవఁడేని బ్రతుకఁ జూచునె! మరలన్-
ధారుణిఁ గ్రక్కిన కూటికిఁ
గరని పేరాస వడెదు దేబలు గలరే!

ఈ లోకంబునం దనుభవింపంగల భాగ్యభోగ్యంబులం దనిసి, నిర్వక్ర పరాక్రమోపేతుండగు నీయట్టి కుమారుంగని... వయోవృద్ధుండనగు నేను నీబుద్ధ్యభిప్రాయంబును హైన్యంబును, నగు నీ కాయంబును నమ్మి పునః ప్రాణప్రాప్తి నెట్లు కోరుదును. అదియునుగాక !

గీ॥ పగలకును వెన్నుఁ జూపినఁ బ్రాణభీతి,
శాత్రవులఁ జేరి యప్రతిష్ఠలకు లొంగి,
బ్రతుకు వారిని జీవచ్ఛవంబు లనరె!
వారి కంటెను, చచ్చిన వారె! ఘనులు.

యుద్ధరంగమ్మునఁ గూలినవారు, వ్యామోహరహితులై శౌర్యగుణ కాంతంబున, సత్వగుణముఖ్యులై, నిత్యానంద కైవల్యపదవిం గాంచి కొని చిరస్థాయియగు, కీర్తిచేఁ బ్రకాశించుచుందురు. అట్లగుటన్ నాపట్లంగల మోహంబును విడచి, సంగ్రామరంగంబున శాత్రవులన్ జతిమార్చి లోకమ్మును, నిష్కంటకమ్మొనరింపుము. ధర్మంబునుం గాపాడుము... అదియు, క్షత్రియకులంపు బిడ్డలకు స్వతస్సిద్ధ ధర్మంబు—తండ్రీ! “ధర్మోజయతి” యను నార్యవచనమ్ములు వినోన్ము గాత, [చేయి నెత్తి]

గీ॥ అరులను జయించి, సర్వ రాష్ట్రాన పత్య
మూని, నిరతంబు శాస్త్రవిహిత ధర్మ
మార్గముల, స్వీయ ప్రజలఁ గూర్మిగల్గ,
నేలుకొనుమయ్య! తండ్రి! నూకె ష్ట్రొడ్ల దాన.

రాజ్యపరిపాలనంబన్న గడుంగడు కష్టంబు, సర్వప్రజామోదంబుగా బరిపాలింపవలెనన్న, నీ ధర్మసూక్ష్మంబులె యాధారంబులు కుమారా వినుము!

సీ॥ రాజకీయోద్యోగ ప్రజల నొప్పింపక
దగు వేతనముల చేఁ దనుప వలయు
పేద సాదలఁ జూచి పేర్మిగాఁ బనులిచ్చి
యన్నంబుఁ గలిగింప నగయు వలయు,

తగు యోగ్యతా యోగ్య తల నెంచి యాశ్రిత
ప్రకరంబులకుఁ బచుల్ పంచ వలయు
అనపరాధులఁ గాచి యపరాధులను నెంచి
యోగ్య దండనలలో నుంచ వలయు
గీ॥ అందు నెందేని, నెక్కింత వ్యత్యయంబుఁ
జరిగె నేనియుఁ, దద్యశశ్చంద్రికలకు
నింద యను కాఱు మొగిళులు నెఱసి కొనును
పొంద రానట్టి దుర్గతిఁ బొందు విభుడు.

రాజ్యపాలనమ్మునను, శాంతమ్మును, సమంజసాసమంజస విమర్శనంబును, కారుణ్యంబును ప్రధానంబులు. క్రోధుండును, నవిమర్శకుండును, నిష్కరుణుండును, రాజార్హులు కారు. మఱియు "రాజ"న్న వాడు,

కం॥ తన వాడు వీడు, వీడొ
డను, భేదము దలఁపఁ జెల్ల దశరాథి యశో
జను విన్నఁ జనము కొల్వన
బని జేసెడి నెట్టిహితుని పట్టున నేనిన్.

ఇట్టి రహస్యముల నెఱింగి ప్రవర్తింపుము... కుమారా! నీ విప్పుడున్న తెఱంగుఁజూడ, యుద్ధమునందే! కృత నిశ్చయుండవై యున్నట్లు తోచుచున్నది. వీరుండగు వాడు, గమనింప వలసిన, నీయొక్క ముక్కును జ్ఞప్తియం దుంచుకొనుము, ఏకాంతి వేని.

క॥ శరణన్న వానిఁ జాలక;
బరుగిడు వానిని, మఱుగు బడిన భయస్తుఁ
దఱిమి, వధింపగఁ జెల్లను!
తెలుగును, దానఁ దన తాత తండ్రుల కీర్తుల్

తండ్రీ! అట్టితరుగులు మాత్రము పెట్టకుము. [గంగురాజునుజూచి] మిత్రవత్సలా! గంగుక్షమాపాలా!

సీ॥ సంతాన విరహిత చింతాకులుల మమ్ము
వెసఁ బిల్చి వసతుల నొసగి నావు
వచ్చిన దాదిగాఁ, దలచిన కోర్కులఁ
"గల్పక" మన నింప గలిగి నావు

యాదవాన్వయము నం । దగ్రగణ్యత నిచ్చి
పేరు ప్రతిష్ఠలఁ । బొంచి నావు
సర్వసేనానిగా । సలిపి నాజన్మ క
ర్తవ్యతా పథము నే । ర్పరచి నాడ

గీ॥ విందు కళ్యాణ పుర వర । మేశు కరుణ
బడయుటకు సాధనంబై । పరగి నావు
మాకు నిలఁ జేసి నట్టి యు । మ్మత్సహాయ
సగణి స్మరణీయ మాజన్మ । జన్మములను

అందులకు నే నెంతయు గృతజ్ఞుండను...సఖా! భగవదాదేశంబునం జేసి నాయీ జీవనరంగంబుననుండి, నిష్క్రమించుచున్న నీ యీ పేదసఖుని తుదిపనవి మాత్రమొకండు చెల్లింపుము, అదియేమన!

గీ॥ పసితనము, పాప మతులతోఁ । బవర మగుట
గాచుకొను భారమెల్ల నీ । కరము లందు
నిడియుఁ నిశ్చింత, దివికి నే । నేగుచుంటిఁ
జూచుకొనుమయ్య! వీని, నీ । సుతుని మాడ్కి—

(కాటమరాజును, గంగురాజున కొప్పగించుచున్నాడు)

గంగు—[దుఃఖము సూచించుచు] మిత్రమా! జరిగిన విపర్యయమ్ములకే దుఃఖించుచున్న మమ్మీ యశుభప్రసంగమున నింకెంతదుఃఖపెట్టుట మీకు న్యాయమే మీరన్నట్లు,

గీ॥ సమరమున నుండి, పాఱుట । చనదు గాని
పసులఁ జాపియుఁ జచ్చిన । వారు బ్రతుక
సింద్యమే! "మృత సంజీవ । నీ" వసిష్ఠఁ
డిడిగి బ్రతుక నెందఱు! సురా । సురలు మున్ను

కావున! స్వామీ! మీ యీ స్వర్గనిష్క్రమణమ్మును, విరమించి కొంతకాల మీ భక్తుల సంతోషపెట్టుటకుం దలంపుడు, మమ్ము మన్నింపుడు

పెద్ది— మిత్రమా! యేదియో చిన్నయవకాశమునుఁ జూచుకొని, యుత్కృష్ట ధర్మములకు హానిజేయుట నామతము కాదు. సర్వము నెఱింగిన మీకు నేనేలుగా

జెప్పవలయునా!... అప్రయత్నలభ్యంబగు నీ స్వర్గగమనమ్మునుమాని, వినశ్వరంబులగు నీయిహసుఖంబుల కాశించుట "నావవీడియంబుధినురుకుట" కాదే! ఎందులకు మఱల నన్నీయలజడిఁబడనేసెదరు. ఇంతటితో నాకు సెలవొసంగుడు. నా యీ బాధ భరింపఁజాల...భరింపఁజాల! (బాధనభినయింపుచు) మిత్రులారా!

గీ॥ చిర వియోగంబు నను నిరీక్షించెడు పితృ
దేవతలు, స్వాగతంబుల దెలుపుచుండ్రి,
రదె! విమానంబు; భటుల పిల్పదె! వినుఁడు,
అనుపరే! నన్ను నిశ్చింత నవధరించి,

[ప్రాణములను విడచుచున్నాడు......గంగురాజును, కాటురాజును పెద్దిరాజునకు ప్రదక్షిణము జేసి మోకరించి]

కాటయ — (చేతులనుజోడించి)

గీ॥ పుణ్యఖని సద్గుణాఢ్యుల ప్రోక్త, ధర్మ
శాస్త్ర సంహితావిజ్ఞు, మజ్జనకు నెలుబు
శాశ్వతానంత శాంత సుస్వాంతుఁ జేసి
స్వామి! రక్షింపుమా! పరంధామ! రామ!

[సాష్టాంగపడుచున్నాడు]

గంగు — (చేతులను జోడించి మోకరించి)

గీ॥ మాన్య, సదయుని, స్వకులాభిమానహృదయు
మిత్రకార్యార్థమై నిజ క్షాత్రధర్మ
సరణిఁ జనువాఁడు, నా మిత్రు శాంతచిత్తు
జేసి, నీ పార్శ్వమునను, రక్షింపు మీశ?

[భక్తితో సాష్టాంగ పడుచున్నాడు]

(బ్రాహ్మణు లుపనిషద్వాక్యముల నాశీర్వదించుచున్నారు)

కాటయ — (గంగురాజున కభిముఖంబుగా మోకరించి నమస్కరించి) స్వామీ! గంగురాజాగ్రణీ!

చ॥ ఎవఁడు వృథాప్రసంగముల నీ యవనవంశజులన్, గలంచెనో
యెవఁడు పవిత్రు మజ్జనకు నీర్ష్యనధర్మతఁ గొట్టిచంపెనో!

యెవడు దురాత్ముఁడై జగము ♦ నేచెను నట్టిడు, వాలకేతువన్
దవిలి వధించివత్తుఁ గరు ♦ ణామతి, నాజ్ఞనొసంగి యంపరే!

గీ॥ పోయి సూర్యాస్తమయము లో ♦ పుగను జేపు
వానిఁజంపుదు నెవరడ్డు ♦ పడినఁగాని,
జాగరూకతఁ గనుడు మ ♦ జ్జనకు శవముఁ,
దిఱిగి చనుదెంచి నా విధుల్ ♦ దీర్చుకొందు.

[కత్తిని త్రిప్పుకొనుచు పరుగిడుచున్నాఁడు.]

గంగు— (ఆశ్చర్యము నభినయింపుచు) ఆ యేమీ! ఈ యుద్రేకము కుమారా! ఆగుము, నేనుకూడా వచ్చుచున్నాను. (రెండడుగులువైచి ముందుఁజూచి) అవురా! యేమి? యీచిత్రము ఆ సౌమ్యమూర్తినియును, నాగంభీరాకారుండునగు స్త్రీ పురుషులెవ్వరు! పోవుచున్న కుమారునడ్డగించుచుండిరి.

[తెరలో]

ఓరీ! బాలకా! యెవ్వడవు! ఈ యర్ధరాత్రంబున, నెచ్చటికేగుచుంటివి! ఆగుమాగుము.

గంగు— అవురా! ఆ స్త్రీ కంఠస్వరమెంత భయంకరము

బ్రాహ్మ— స్వామీ! నిశాసమయంబున, సమరభూములలో పిశాచములుండునని పెద్దలందురు, అవి కావుకదా! కొంపతీసి! [భయమున నటించుచున్నాఁడు]

గంగు— (చేతితో వారించుచు) కాదు. భయపడకుము. (వినుట నభినయించుచు) ఉండుడు కుమారుఁడేదియో యనుచున్నాఁడు- విందము.

[తెరలో]

ఉ॥ పావనుఁడైన, పెద్ది సర ♦ పాలుసకిన్, సతి పెద్దమాంబికా
దేవికిఁ గూర్మి పుత్రుఁడ వ ♦ ధింపఁగ నేగెద వాలకేతువన్
దైవ విరోధి, మీరెవరో! ♦ తల్లివచింపరే! యింతరాత్రి యం
దీవిధి నీరణావనిని ♦ నెందులకున్ జరియించుచుండిరో!

గంగు— (తలనూచుచు) కుమారా! మంచిప్రశ్నవైచితివి. యీ ప్రత్యుత్తరముచే మా సంశయములనుఁ దీరగలవు (వినుటనభినయింపుచు) అదిగో! ఆమె యేమియో యనబోవుచున్నది.



[ తెరలో. ]

కుమారా! ధన్యుడవు. నీ జన్మయే ధన్యము. "మీరెవర"ని యడిగితివి, వినుము.

ఉ॥ గంగను నేను, నీతడు స గర్భ్యుడు, నామము పోతురాజు సే
రంగము నందు, భక్తులు ప రాబును జేరిరి, పోరి, తత్ప వి
త్రాంగములన్ మృగంబులు వి హాంగము లంటగ నీకఁ జూచుచుం
డం గల వార మీసిశ్, నా నర్పగ చుట్టము లగ్ని కార్యముల్.

కుమారా! నీప్రయత్నము దైవహితమగుట, మేమును ప్రచ్ఛన్నులమై సహాయులుగా నుండెదము రమ్ము! జగదుపద్రవకరులగు నీదుష్టులంగెండి సజ్జనుల బాధల నుత్తరింపుము...

గంగు — (జేతులుజోడించి) ధన్యోస్మి! ధన్యోస్మి భక్తులగు నీయాదవులపట్ల నీకెంత ప్రేమతల్లీ! ధన్యులము. ధన్యులము.

గీ॥ తల్లి! బ్రహ్మాది సురలకే త్వత్స్వరూప
దర్శనం బంద శట్టిచోఁ దనకుఁ దాన,
నప్రయత్నంబుగా నేడు నబ్బె మాకు
నోములు ఫలించె నింక ధన్యులము మేము!

(సాష్టాంగ పడు చున్నారు)

అవనిక దింపబడును



౬వ రంగము.—యుద్ధరంగము.

[ఆశ్చర్యమభినయింపుచు వెనుకకు వెనుకకు జరుగుచు]

వా ల కే తు వు ప్ర వే శ ము.

అబ్బా! యేమీ! వీని లక్ష్యశుద్ధి!

ఉ॥ వ్రేలెడు లేఁడు బాలుఁడు, ప విప్రతి మానములై తనర్చినన్
గాలుని బాధవెట్ట సమ కట్టె శరావళి యేమిసేతు, నే
దాళఁగఁ జాల నియ్యది వి ధాత విధానమొ, లేక పూర్వజ
న్మాలనుఁ జేసినట్టి వృజి నమ్ములు నీగతిఁ బాధ వాటెనో!

(శరమును తప్పించుకొనుట నభినయింపుచు) యేమీ! ఆ శరవేగము...వీని బలపరాక్రమము లద్వితీయములు ...ఆ శూరత్వ మత్యద్భుతము, అభిముఖంబులగు ఖడ్గఘాతంబులకున్ దలకుడు తీక్ష్ణశరంబులకున్ వెఱువడు భయంకరులగుమచ్చెనా నాయకులకు వెనుదీయడు బుసగొట్టుచు త్రాచుబాముపగిది, సేనాసముదయ మధ్యంబున, సంచరించుచున్నాడు, అబ్బా! యేమి! వీనిసాహసము ...ఔరా! యేమి కాలమహిమ! ఔను ఇయ్యది కాలమహిమ కాక మఱేమి!

కం॥ అసురులు ప్రత్యక్షంబుగ,
నసమాన, రణాంగణముల యంగన గతి దే
ఱెసగిన, వారల నిట నా
పసిబాలుం డడచు చుండె పాపమదేమో!

(తెరలో చూచుచు) ఇటేవచ్చుచున్నాడు! రానిమ్ము నీ గదాహతిచే నొక్కమారుగా తుదిముట్టించెదఁ గాక రానిమ్ము [గదను సవరించు చున్నాడు]

[తెరలో]

ఓరోరీ! దానవచమూపతులారా! యేల మీ రిట్లు పఱుగిడెదరు నిల్వుడు నిల్వుడు పాఱిపోకుడు ...

ఉ॥ చచ్చె నటంచు నెంచి, యని శాంతిలి యేమఱియున్న మద్గురున్
మచ్చర మంది వెన్నొసుక చైచని, కొట్టియు, జంపె నెవ్వఁడా
ప్రముచ్చును, వాలకేతుఁ బోఁడి బుచ్చగ వచ్చుచు నుంటి నెచ్చటన్
జొచ్చెనొ, చూపుడింత, సుఖ సుప్తి నిదోఁగెదు గాక లోకముల్

వాలకే — కన్నులు తెఱువని, పసికూన, యేమి! వీని పోటుమాటలు.

[పటాక్షేపముగా పై పద్యమును జదువుచు కాటమరాజు ప్రవేశించుచు]

ఓరోరీ! దానవ......

ఓరీ! నరాధమా! ఇంక నెచ్చటికేగెదవు నిల్వుము—పారిపోకుము.

శా॥ ఓరీ! దుర్మతి; యేల డాగితివి. నీ యుద్రేక మేమయ్యెరా!
బీరంబుల్ కడనుంచి రమ్మిటు, రణో ర్వీ మన్నిశాతాస్త్రశ
స్త్రారంభంబుల నీవ చచ్చెదవు! లే దా వంత యేన్ సాశయం.
బోరీ! రాత్రించర! దక్కితే! పవి సమ క్షోర్వీ ధరంబో యనన్

కం॥ ఓరీ! దుష్టుడ! భువిలోఁ
దూరిన, జదలకు నెగిరిన, ధూర్జటి తోడై
పోరుల నినుఁ దప్పించిన,
వారక నధియింతు నిలుము! వడిగల దేనిన్

వాలకే—(తనలో)ఇక నిట్లూరకున్న లాభములేదు యెదుటఁ బడెదఁగాక(ముంగుకువచ్చి)
ఓరీ! బాలకా! యేమి! నీ పిచ్చికేకలు.

గీ॥ పాప పుణ్యంబు లెఱుగని, పాలుద్రావు
బాలుడవు నీవు మాతోడ, బవర మునకుఁ
గాలు ద్రవ్వెద, వెట నేని గలదె! మెఱుగ
నేర్చునే! పిల్లకాకి, యుండేలు దెబ్బ

కాటమ—(క్రోధముతో) ఓరీ! యేమీ! నీ దాంభికములు, బాలుండననియా యధి క్షేపించుచుంటివి! మహామహీధరంబుల జిదుపునట్టి వజ్రమెంత. చిన్న దీపము గాఢాంధకారమ్మును, జిమ్మివైచుటఁజూడవే! రణంబున, సత్తమ చంద్రవంశ క్షత్రియులకుఁ బ్రాయము నిమిత్తమాత్రము, దానికేమి దుర్మదాంధా!

కం॥ బాలుండనో, నీపాలిటి
కాలుండనొ, తెలిసికొందు కాక, వృథాగాఁ
దూలగ నాడుట తెల్లనె
మేలంబులె. సమరమున, న మిత్రులయెదుటన్.

వాలకే—బాలకా! నామాట వినుము, యెందులకు జెడెదవు...

చ॥ అనలమునందు జొచ్చి తెగటాతెడు నా శలభంబు భంగినన్
జెనకెదవేల! నీవు కడు చిన్నవు "పాపము" జాలియయ్యెడున్
నిను గనినంతఁ! నెవ్వరిటు, నేర్పిరి, నీదగు రాజ్యమెద్ది నీ
జనకుఁడెవండు, నీకులమ్ము సంజ్ఞల వెట్టివి, చెప్పుడింభకా!

కాటమ—ఓరోరీ! అధమాధమా! యుద్ధరంగమ్మునం దభిముఖమ్మయి నిలిచిన, శాత్రవుల కుల గోత్రనామంబు లడుగుట కుచ్చితబుద్ధి యని పెద్దలందురు, దుష్టబుద్ధివై యడిగితివి... యైనను చెప్పెదను వినుము.

చ॥ ఘనభుజ విక్రమాఢ్యుఁడు, నఖర్వయశస్కుని, పెద్దిరాజు నా
జనకుఁడు, కన్నతల్లి గుణసద్మ, పతివ్రత పెద్దమాంబ పా
వనమగు, యాదవాన్వయ ప్రవర్ధనుడన్ జరియింతు నిన్నుబోల్
దనుజులఁ గీటడంప వసుధాస్థలిఁ గాటమరాజు పేరునన్

వాలకే—(సాక్షేపముగా) ఓహో! ఇదియా! కారణము. "తండ్రి జంపితిర"ను క్రోధోద్రేకంబునవా నింతఁ దెగించితివి! భేష్ నీ మూర్ఖంబునకుఁ గోపమువచ్చుచున్నను నీ ప్రాయోద్రేకమ్ములకుఁ జాలియు, నవ్వును వచ్చుచున్నది. చాలు చాలు, ఇంత బుద్ధిగలిగి, నా యండనుండుము కూడుగుడ్డనిడి యెద్దియేనిన్ బని గల్పించెదను. యెందులకన్యాయంబుగాఁ జచ్చెదవు బాలుండవగు నిన్నుం జంపుటకు నాచేతులును రాకున్నవి.

కాటమ—

మత్త॥ మాటిమాటికి బాలుడంచును మమ్ము మేలములాడెదే
కూటికిన్ మఱి గుడ్డకిచ్చియుఁ గూడఁ బోషణఁ జేసెదే
నోటికందిన, రీతిఁ గూసెను, నోరుమూయుము నింతటన్
గోటుమేటివె నైన, రమ్మిటు పోరు సల్పుము దుర్మతీ!

(శరములు గుప్పించుచున్నాఁడు.)

వాలకే—[కోపముతో] యేమి! తొండముదిరి యూసరవిల్లి యైనదే!

తరల॥ పసితనంబసి యూరకుండిన, పయికిఁ బైకొని వచ్చెదే,
విసముగా వెగటయ్యెనే, నే వినుచు మాచి దురాత్మకా

కసిమసంగెద, నిల్వుమీయిట కై కదనమే మని యెంచితో
పసుల గాచుట కాదు ప్రాణము కై క్షణముగా విడవలయురా

ఇదిగో! వచ్చితివి! కాచుకొనుము— (శరమును విడచును)

కాటమ—[తప్పించుకొని] ఓరీ! క్రూరా! నీ శరమే మైనది. ఇదిగో! నా యీ బాణమును గాచుకొనుము, (విడచును)

వాలకే—(తాకుడువడి, తనలో) అబ్బా! యేమి! వీని శరలాఘవము పరమేశ్వరునకైన నిట్టి లక్ష్యమమరుట,దుర్ఘటము...... ఇంక వీని ప్రత్యక్షంబున, గెలుచుటసంభవంబు. మాయా యుద్ధమే కర్తవ్యము.

[తెర లోనికి అరుగుచున్నాడు]

కాటమ—[ముందు చూచి]యేమి; వీడెందు మాయమయ్యెను; వీడు మాయా మంత్ర వేత్తయని కూడా విన్నాను (తలపంకించుచు) కానీ! చూచెదను గాక! వీని మాయలు...

(వెనుక పెద్ద చప్పుడగుటను విని ఉలికిపడి తిరిగి చూచి క్రోధముతో,) ఓరీ! దుష్టా!

కం॥ మాయా బలంబుచే న
న్యాయంబుం జేసి, చంపకై నాత్మ దలంతే!
నీయుద్యమం బదెట్టుల
బాయుం గల నవ్వర, మనుజ పసరమ నగుటన్

వాలకే—[వెనుకగాఁ ప్రవేశించి] ఓరీ! బాలకా! చచ్చితివి. [గదచే గొట్టబోవుచున్నాడు.]

కాటమ—ఓరీ! దుర్జాతీ! తాటాకు చప్పుళ్లను కుందేళ్లు బెదరునా! ఇంత తమాయింపుము. చివరకిట్టి నీచ కార్యములకున్ గూడఁ గడంగితివా!

ఉ॥ యుద్ధ విరుద్ధ ధర్మములకై నోర్చి జయంబుఁ గణింపఁ జూతువే
బుద్ధి విశుద్ధ బద్ధములఁకై బోవలదే! యమబాధఁ ద్రోయువా
పోద్ధతి కేనియున్ భయముకై నొందగఁ బోలరె! యిట్టి సాహసపుం
బద్ధతి క్షెల్లు పాల్పడితె! కై పాపి! భరంబయి తేమి భూమికిన్

ఇదుగో! యింక నీవు లేవు- [కత్తిని త్రిప్పుచున్నాడు]

వాలకే— ఓరీ! డింభకా! నీవు చచ్చితివి, (కత్తిని విసరుచున్నాడు,...వాలకేతుడు పారిపోవుచుండ వెంబడించుచు, తిరిగి ప్రవేశించుచు పోరుచు, వాలకేతుని క్రింద పడవైచి కాటమరాజు వాని, వక్షస్థలము నెక్కి,— (గ్రుద్దుచు,)

కాటమ—ఓరీ! దుర్మదాంధా! (పరశువుచే మోదుచు-)

సీ॥ భక్తుల సజ్జన ప్రకరంబులను, బాధ
పరచిన, దుర్దాంత పాప ఫలము
పరమ సాధ్వీ మణుల్ పర కాంతలను ముట్టి
వెసనమొందించిన దుష్ట వృజిన చయము,
దేవతా బ్రాహ్మణ స్వ విత్తంబుల
నపహరించిన యట్టి యఘ వితాన,
మాహవ ధర్మ శూన్యత విరోధులఁ బట్టి
కలచిన కడు ఘోర కలుష వితతి.

గీ॥ నూకి మొండెము తోడను నుసుప నున్న
కాచుకొను మింక మత్తీక్ష్ణ ఖడ్గ ధార
కెరయగుము. నీవధంబున నింత నుండి
యఖిల లోకమ్ములును సౌఖ్యమందు గాక.

ఖడ్గముతో [మోదుచున్నాడు]

[ తెర లో ]

కాటమరాజచంద్రునకు జేజే యాదవయోధులకు జేజే (దేవదుందుభులు మ్రోయును.

(పుష్పవృష్టి కురియును.)

అవనిక దింప బడును.

ఇది
శ్రీ సీతానగరాంజనేయ కరుణా కటాక్ష ప్రలబ్ధ కవితా
శిల్ప ప్రవీణ, పట్నాల వంశోద్భవ అన్నపూర్ణా
చిదంబరాచార్య జ్యేష్ఠ తనూభవ
సుబ్బరాయ నామధేయ
ప్రణీతంబైన
"కాటమరాజు"
అను
దృశ్యకావ్యంబు నందు,
పంచమాంకము.

---





శ్రీ

# కాటమరాజు.

## షష్ఠాంకము.

[పెద్దిరాజు శవమును సమీపించి పెద్దమాదేవి బిడ్డల నొడిలో కూర్చుకొని, కూయుచుండియుండును, గంగురాజు భార్యా సహితముగా నిలచియుండును.]

గంగు — [చేతులను జోడించి భయభక్తులతో] తల్లీ! సాధ్వీమతల్లీ!

మ॥ భువనద్రోహిని, వాలకేతు ననిలోఁ గ్రూరోత్కార్య సేనాధునిన్
బవరంబందున జొన్పి, జంపియు మహా వైధవ్య దుఃఖమ్ముచే
నవశన్ జేసిన, నిన్నృశంసుని, దురంతానంత దౌర్భాగ్యునిన్
భవదీయంబగు శాపసంహతిని, జాఁగవద్దిట్టుమా! తల్లిరో!

కం॥ మిత్రఘ్నుఁ బాపభరితుని
గోత్రవిహీనంపు నీచ జన్ముని ప్రేమా
పాత్రుఁ భవచ్ఛాపంబున
ధాత్రీభర ముడుపు మమ్మ తల్లీ! యెలమిన్

పెద్ద — (సకరుణాఖేదములతో) నాయనా! మా ప్రారబ్ధమునకు నీవేమి చేయుదువు. నీవు మాకొనరించిన, మేలు లనేకంబులు, అట్టి సుగుణపుంజమవగు నిన్ను నేల కోపింపవలయును, మందభాగ్యులకు సుఖంబులు, వాంఛించిన వచ్చునా! కావున, దానికై చింతింపవలదు, ఈ దేహంబు లస్థిరంబు లనుట నెల్లరెఱింగిన విషయమే, అన్నెము పున్నె మెఱుంగని, పసికూనలు ... నాయీముగ్ధ

బిడ్డలను, [దుఃఖోద్రేకంబున బిడ్డలను జేరదీసి] తల్లిదండ్రులులేని యీ దిక్కుమాలిన పిట్టలను, వీరిని (బిడ్డలను గంగురాజున కొప్పజెప్పుచు,) మమ్మెట్లు నీ దయాదృష్టులం బతికించితివో! యట్లే తల్లివై, తండ్రివై యాప్తుండవై జూచి, యనాధరక్షణ సత్కీర్తినిం, గాంచుము తండ్రీ... వంశానుగతంబగు సదాచారక్రమంబునను,

* కం॥ పతితోడ ననుగమించుట
సతికి, పరమధర్మమండ్రు సజ్జనులు తగన్
శ్రుతి చోదితాచరణములు,
మతిఁ దలచిన, నుభయలోక మాహాత్మ్యము లొసఁగన్

కావున, నాప్తులరగు మీ రెల్లరును, ప్రమోదంబున నా సహగమనోద్యమంబునకు ననుజ్ఞనిండు......

గంగు— (చెవులు మూసికొని) హతోస్మి! హతోస్మి! హా! యెంతమాట, అమ్మా! పితృవియోగంబున నడలు నీ పసిబిడ్డలు నీహృదయభేదనమ్ములగు మీమాటలు విన్న బెదరిపోర! తల్లీ! ఇంత నిష్కరుణగా! విధినిర్ణయమ్ము చొప్పున స్వర్గస్థుండగు భర్తననుగమించుట, భగవంతుని యాశయంబునకును ప్రకృతికిని, విరుద్ధములు... అందుచే నయ్యుద్యమంబు విరమించి, భక్తులమగు మేమిచ్చు సేవలంది, నీ బిడ్డల యున్నతికిం బ్రయత్నింపుము... వచ్చినవారితో బడి చచ్చెదరా! యెచ్చటిమాట! తల్లీ!

పెద్ద— నాయనా! గంగురాజా! సర్వము నెఱింగిన మీ రిట్లనిన, నే నేమందును

† కం॥ పతి దైవము సతులకుఁ దా
పతియ సుమీ గుఱి పరార్థ ఫల సంప్రాప్తుల్
బతి శుశ్రూషా పరయగు
సతిన సుమీ! పరమ పుణ్య యఖిల జగమునన్

కమలాప్తుని బాయు కమలిని యట్లు పతిలేని సతిబ్రతుకు వ్యర్థము. అట్లగుట నా పతిచనిన వెనుక "నశుభసూచకమగు నీ మొగంబునెత్తికొని" "విధవ" యను ననర్థకాహ్వయంబును మోసి నే నెట్లు బ్రతుకఁగలను. తండ్రీ! అదియును గాక,

* పూర్వకవి రచితము. † భారతము.

ఉ॥ జన్నము లెన్ని చేసినను, సత్య శమక్షమహూది సద్గుణ
ప్రోన్నతి భీమణాటవుల నుగ్ర తపంబులచే వరంబులన్
గన్నను, పుణ్యతీర్థ గమ నంబుల నైనను నందలేరు భ
క్తిన్నిజనాథు గొల్చు సతీ మణులందెడు పుణ్యలోకముల్

అట్లగుట, క్షణికంబులగు నీ యైహికంబు నాసించి శాశ్వతంబులగు నాముష్మిక సుఖంబులం బాడుజేసికొనుమందురా! ... సదయులరై మీ పట్టుదలను విడచి, నా కోర్కెలనింపుము, కూర్మికాంపున, నీ చంటివారింబెంచి, పున్నెంబునన్ బొమ్మ... తండ్రీ! దీనసంరక్షణ ఫలంబున నుభయలోక సుఖంబుల నందుదువు గాక! ... [కాటమరాజును దరిజేర్చుకొని] తండ్రీ! నా నోములపంట!

చ॥ అతి బాలు, నాలకేతుం దును మాడ్కి, రణావని, తండ్రిపేరు, ని
ల్పితి వదెచాలు! వచ్చితివి లెక్కకు నేనును వీరమాతగా!
సుత! కోటి నోము నోచితిని జూడగ బ్రాప్తము లేకపోయె, నీ
యతులిత, భోగభాగ్య విభ వాతిశయంబులదృష్ట హీనతన్

అయినను, నీ యట్టి క్షాత్రతేజుండగు సుపుత్రుంబడసిన, నేనెంతయు నదృష్టవంతురాలను, ధన్యురాలను, కుమారా! ప్రజామోదముగ్ బడసి స్వకులవర్ధనుండవయి గో సంరక్షణంబు నేమఱక, ధర్మమార్గంబునం జరింపుము. తండ్రీ! పసివాడవగుట నే నొక్కరహస్యంబు దెల్పెద, వినుము.

సీ॥ గోప్రదక్షిణ మాత్ర భూప్రదక్షిణ పుణ్య
ఫలమును గను, నెట్టి పతితుడైన,
పసువులం బూజింప బసుపతి కైంకర్య
ఫలితార్థ సంతృప్తిం బడయ గలుగు
ఆవుల మేపిన, నఖిల బ్రాహ్మణ్య సం
తర్పణానంత భ ద్రంబు కలుగు
సురభులం బాలింప, సురరాజ్య పాలనా
నూన వైభవముల నూన గలుగు

గీ॥ గోవయో మయ మూత్రముల్ | కోటిపుణ్య
ఫలదములు, శుద్ధములు, గృహా | పతికి, నింట
శోభ నమ్ములు నట్టి ప | శుప్రపాల
నమ్మ విడువకుమయ్య! జ | న్మమున నెపుడు

గీ॥ ఇహాపరార్థమ్ములకు జీవ | నైకధనము;
గోధనము సుమ్ము యాదవ | కులము నకును.
గానఁ దద్రక్షణమునకై | గడఁగవలయు
యాదవుండై జనించిన | యతఁడు పుడమి

గీ॥ అఖిల ధర్మంబులును దాన | నడఁగియుండు
జెలఁగి, గోక్షేత్ర పట్టాభి | షేకమూని,
తండ్రి! పాలింపుమా! జనో | త్సవము గాఁగ
నుభయ వంశమ్ములును కీర్తి | నొప్పుచుండ,

**కాటమ**—తల్లీ! నీ యాజ్ఞ లనుల్లఘ్యంబులు (భయవినయంబులతో మ్రొక్కుచున్నాడు)

పెద్ద— (కుమార్తెను దగ్గరకు జేర్చుకొని) తల్లీ!

కం॥ ముద్దులు ముచ్చట లేమియు
నొద్దికమై దీర్పకుండ | నోగి చనిరంచున్
పెద్దగఁ జింతిలకమ్మా
తద్దశ పాపులగు మాకుఁ | దక్కక పోయెన్

అన్నయ్య నీకన్ని ముచ్చటలు తీర్చగలందు యేలోపమునుండదు...
తల్లీ! పాపమ్మా!

సీ॥ ఒక వేళఁ గారణం | బుండి కోపించిన
నన్న మాటల కెదు | రాడకమ్మ
ముద్దుముచ్చటలలో | నెద్దియేఁ లోపంబు
వచ్చిన, మము నెంచి | వగవకమ్మ

అత్తమామలు చెప్పి నట్లు చేయుచు భక్తిఁ
దలలోని నాల్కగా మెలగుమమ్మ
ఆఁడు బిడ్డల, గూడి, యాఁడుపట్టుల మేల
మాడిన గినిసి పోట్లాడకమ్మ

గీ॥ మెట్టి సతులకు నేసియుఁ బుట్టినింట
గష్టపడవు నుంటఁ జనదను నుడులు మాఱువ
కమ్మ! పతియెట్టివాఁడైన, నతివ కతఁడె
పరమదైవంబు, ప్రాక్పుణ్య ఫలమతండె

మఱియును, తల్లీ!

క॥ పతియాజ్ఞ లేని పనులను
సతిచేయఁగఁ జనద యెట్టి సద్ధర్మములేన్
సతికిఁ బతిసేవ మే స
ద్గతులకు మూలంబు, దాన గణ్యత గనెదున్

కావున, గుణవతివై జగంబున బుట్టినింటికిని, మెట్టినింటికిని, వన్నె దెచ్చి చిరంజీవివై సుమంగళివై యుండుము తల్లీ! [లేచి రంగాంబ చేతులఁబట్టి] అమ్మా! రంగమాంబా!

చ॥ కలసిన వేళ మెట్టిదియొ కాని, నిరంతర మొక్క తల్లి బి
డ్డల మనగా మెలంగితిమి డాచితి నెంతయు మాయవజ్ఞలన్
దలపున నుంచి, ప్రేముడిఁ గృతజ్ఞను, నీయెడ తల్లి! యెంత ని
ష్కలుషములైన భావములు, సాధ్వీరో! పూజ్యవు భూతలంబునన్

సదయాంతఃకరణవగు నీకు ప్రత్యేకముగా చెప్పనక్కరలేదు...అయినను నాకడుపు కక్కుఱితి, నింతవట్టు తొందరించెదు. మన్నింపుము.

ఆ॥ వె॥ కన్నతల్లి ప్రేమ / కంటెఁ, బెంచిన తల్లి
ప్రేమ, మిన్నయనుట / వింటి మొదటఁ
నింతనుండి, రెండు / నీవవై దయఁజూడు
మప్ప! కనులకు కను / రెప్పలట్లు

విధిచోదితములగు దుష్కర్మల వలనను.

గీ॥ మగఁడు పోయిన పిదపను / మగువ లిలను
మనుట సాధ్వీజనంబుల / మతము కాదు
కలుషములు సుమ్ము నెందును / కాంతు విడచి
వెలఁదులుండుట, కాన నే / వెడలి వత్తు

గంగ—[భక్తితో] తల్లీ! ధన్యులము- ధన్యులము. మా స్త్రీజాతి నేఁడు గదా. ధన్యత్వమ్ముఁ గాంచినది. నీ జన్మమూలమున, సావిత్రి మొదలగు సతీమణుల చారిత్రములు స్థిరపడినవి. ఇప్పుడు నే నెంతయు గర్వించుచున్నాను తల్లీ! భవదీయ పవిత్రాంశయంబులే లోకమునకు మార్గదర్శకములగుఁ గాక.
[సాష్టాంగపడుచున్నది.]

పెద్ద— నాయనా! గంగుభూపాల! నాయందు పుత్రికావాత్సల్యముంచి నా యిచ్చ నాదరింపుము, నా సహగమనోద్యమంబునకుం, దగు ప్రయత్నంబులం జూడుము,

గీ॥ ఇదివరకె యెంత దూరమ్మొ / యేగియుండు
నామనోహరుఁ గలసికో / నంగ నాత్ర
-పడెదు, నా ప్రార్థనము వి / ని వరదయార్ద్ర
చిత్తమునఁ, దత్ప్రయత్నంబుఁ / జేయుమయ్య

గంగు—తల్లీ! చిత్తము మీ యభిమతమే కానిండు. [నిష్క్రమించుచున్నాడు.]

పెద్ద—[గంగమాంబను జూచి] తల్లీ! గంగమాంబా! నేనును దదనుగుణ ప్రయత్నంబుల నుందుగాక......

అవనిక దింపఁబడును.

---

బ్రాహ్మణముత్తైదువలు, మూసివాయినములతో
ప్రవేశించు చున్నారు.

సుబ్బలక్ష్మమ్మ—అహో! రామలక్ష్మమ్మ! యేమమ్మా! ఆమె మనోద్రఢిమ! మండుతూ ఉన్న అగ్నిగుండములో నిలుచుండియే, మూసివాయినాలన్ని యిచ్చింది, బంగారపు ప్రతిమ; దానాలకు కరువులేదుకదా! [తెరలోనిచూచి] ఇంకా యెంతమందివస్తున్నారో! అదుగోచూచావా! ఆహా! కన్నుల పండుగ. ఈ రోజుచూడనివాళ్ళ కర్మేందుకు!...అంత అగ్నిలోనుండియు, చెక్కుచెదిరిందటే తల్లి! సాధ్వీమతల్లి. చేతులెత్తి మ్రొక్కాలి,

[మ్రొక్కుచున్నది]

రామలక్ష్మమ్మ—ఔనమ్మా! అవును? ఆడవాళ్లకు. అగ్నిదేవుడు తండ్రిలాంటివాడంటారు; ఇట్టి తల్లులపట్ల నింకాచెప్పాలి! (ఆశ్చర్యముతో) యెక్కడిడబ్బు... ఒక్కొక్క వాయినానికి కాసుకుతక్కువలేదుగదా! యెవతి యదృష్టముకొంది, వగహాలు, మొహరీలు, నవగసులు అన్ని బంగారపు నాణాలే! వచ్చాయి...యేమి! యీతల్లి ధర్మనిశేషము (కోలాహలము వినుటనభినయించుచు) అదుగో ఆకోలాహలమేమిటి!

సుబ్బ— మనవాళ్లు బ్రతుకనిస్తారు! ఒకళ్ళమీద నొకళ్లుపడి నెట్టుకొని, వస్తున్నారు (వాళ్లనుద్దేశించి) చావండి? అదుగో! ఆనాగమ్మ వస్తేనె! ఆరొక్కతే కాదు వాళ్ళముత్తాముత్తా అట్లాటిదే! ఊళ్లో మంచికి చెడ్డకు ముందుగా సిద్ధ తయారవుతారు...నాకు దొరకనిచ్చారా! చంపారు కామూ! ఆఖరుకు పేరు దక్కనిస్తారా! మన బాపనమ్మోళ్లు... సామాన్యులా!...

రామ— అందులో నాగమ్మకంటె పుల్లయ్యశాస్తుర్లుగారి పెండ్లాము, వెంకటలక్ష్మమ్మగారున్నదే! ఆ బిడవతీ! యెక్కడచూచిన, ఆవిడే...కీమరాయిలాగు, అయస్తూ పెత్తనమంతా, తనమీదనే నడవాలంటుంది. యేమి చెప్పను! ఇందాక, ఆ మెపడ్డపాట్లు, అంతా కెందుకో! కట్టుకుపోతుంది కావాల్ను (అటుచూచుచు) యేమిటే, ఆయల్లటిమతీ!...యేమిటోచను. (ఆశ్చర్యముతో) యేమిటమ్మా అది? అగ్నిజ్వాల లెట్టులాకాశము నంటుచున్నవో! యేది! ఆ పెద్దమాంబాదేవి! ఆమహాత్మ్యమిట్లో చూచివత్తాము రావమ్మా [చేయిపట్టుకొని లాగుచు, నిష్క్రమించుచున్నారు]

[దివ్యశరీరములంతో విమానారూఢులై పెద్దిరాజు పెద్దమాంబయు నభో
మార్గమున జనుచుందురు. గంగురాజు, గంగమాంబ, కాటమ
రాజు, పాపమాంబ, ముత్తైదువలు, మానముద్రితులై
భక్తితో చేతులు జోడించి పైకిజూచుచుందురు.]

పెద్దమాంబ —

ఉ॥ వేదహితైక చర్యలఁ బకే విత్రులరై తగునట్టి వంశ ము
ర్యాదలతోడ వచ్చినను కే నాత్మఁ దలంచెదు భక్తకోటికిన్
సాదర బుద్ధిమై సిరులు కే లన్నియు దీరిచి ప్రోచుచుందునో
యాదవులార! రేయుఁబకు కే డయ్య! నిజాన్వయ ధర్మకర్మముల్

(రామలక్ష్మమ్మ - సుబ్బలక్ష్మమ్మ - మూసివాయినముల చేటలను క్రిందఁబెట్టి చేతులుజోడించి)

- తల్లీ! సాధ్వీమతల్లీ! పెద్దమాంబికామహారాణి, నీపవిత్రమైన యాజ్ఞలను, నీలోకము శిరసావహించునుగాక, తప్పకవహించునుగాక. నిశ్చయము ముమ్మాటికి నిశ్చయము. [మ్రొక్కుచున్నారు]

అనినిక దిగపబడును



ఇది

శ్రీ సీతానగరాంజనేయ కరుణాకటాక్ష ప్రలబ్ధ కవితా
శిల్ప ప్రవీణ, పట్నాలవంశోద్భవ అన్నపూర్ణా
చిదంబరాచార్య జ్యేష్ఠ తనూభవ
సుబ్బరాయ నామధేయ
ప్రణీతంబైన
"కాటమరాజు"
అను
దృశ్యకావ్యంబు నందు,
షష్ఠాంకము.



శ్రీ

# కాటమరాజు



## సప్తమాంకము.

—:o:—

### 1 వ రంగము—ఉపవనము.

[పాపమాంబ విచారగ్రస్తయై ప్రవేశించుచు]

మ॥ సిరి సంపత్తులఁ బాడిపంటలఁ, బ్రశస్తిన్ గాంచి పూర్వార్జిత
స్థిర, సామ్రాజ్యత నొప్పి, శాశ్వత యశశ్రీరాజితంబైన మా
కరియాలాన్వయ మిట్లు దిక్కుఁజెడి యీ కాలంబునం దక్కటా
పరులన్ జేరియు, నన్నపానములకై ప్రార్థింపగాఁ జాలెనే

హా! తల్లీ? హా! తండ్రీ? మహామహులగు మీకడుపున బుట్టిన, మాకా యిట్టి పారతంత్ర్య జీవనము,...తండ్రీ!

ఉ॥ రాజితకీర్తి, తాత వల రాజునకున్ జనియించి, మించి, ఘో
రాజుల దుర్నిరీక్షణ భయప్రద వర్తనులైన తమ్ములు
స్తేజితులై కళంకులను దీరిచియుండగ, రాజ్యమెల్ల వి
భ్రాజితలీల నేలవె! శుభంబుగ నీకు కుటుంబవృద్ధికిన్

అట్టియున్నత సమష్టి కుటుంబము నెందులకిట్లు విడదీసితివి;

గీ॥ నొక్కని యదృష్టమునఁ జేసి యున్నవారి
కందరికి, సౌఖ్యసంపద లలరుచుండు
మొగలి పూరేకు కల్గు పెట్టెఁ గల బట్ట
లన్నిటికిఁ దత్సువాసన యలరునట్లు,

అందెవ్వరి యదృష్టమో!...పోనీ! మిమ్మట్లు ప్రోత్సహించిన, యప్పరమేశ్వరుండు, సద్యస్కాలఫల ప్రాప్తులంజేసియు, నీగడువేల నియమింపవలయును...అవును! మీరేమిచేయగలరు! ఇయ్యది దైవసంకల్పము...వానిముందు పురుష ప్రయత్నములు, గాలికెగురు, గడ్డిపోచలు,.....ఇదియొకటే కాదు!

సీ॥ ఆలిఁగోల్పోయి, య లో! లక్ష్మణాయంచు
శ్రీరాముఁ డానాఁడు చేటుగనఁడె,
సత్యసంధుఁడు, హరిశ్చంద్రభూపాలుండు
కాపుండఁడే! వల్లకాడులందు,
నలచక్రవర్తి యా కలి దప్పులఁ దపించి
యల్లాడి, పోఁడె! కానడవులందు,
తమ్ములతోఁ గూడ ధర్మరాజజ్ఞాత
వాస కార్యములలోఁ బడఁగ లేదె!
గీ॥ పావనులు, నున్నత కుటుంబ భవులు మున్ను
నెందఱెందఱో, యిడుముల నందిరకట
కాలవిపరీతమో! కర్మ గతియొ! లేక
ప్రకృతి సహజంబొ! పతన పరివర్తనములు,

[బత్తిరన్న కాషాయవస్త్రధారియై కాశీకావడితోఁ
ప్రవేశించి, పాపమాంబనుఁజూచి]

ఆహా! యీయమ్మాయియెవ్వారైయుండును! ఈమె పోలికనుబట్టి మా పెదతల్లి ఐద్ధమాదేవి స్ఫురణకు వచ్చెడి, ఆహా! యేమి! ఆసాత్త్విక సౌకుమార్య స్వరూపము!......యాదవ బాలికయగుట మాత్రము నిశ్చయము...ఈమె దీనాననమునుండు, వెలువడు వాక్యములబట్టి, తమవంశీయులు, మున్నున్నత, దశ, ననుభవించినట్లును, నిప్పుడు, క్షీణదశ ననుభవించుచున్నట్లును, స్పష్టపడుచున్నది,... అడిగి కనుగొందుగాక. [సమీపించి]

ఉ॥ యెవ్వరి చిన్నదానవు, సమిద్ధగుణాశ్రయవు నీవు తల్లి? ని
న్నెవ్వరు కాంచి, పెంచి, తలఁచిరి? నీయభిధానమేమి! నీ
విన్వని. బూర్వవైభవము తెంచి, విచారమునొంద లాభమా!
యీవ్విధి నిర్ణయంబుఁ దరమా, తలఁపంగ నేఁటికేనియుం

పాప—అయ్యా; మందభాగ్యనగు నాప్రశంస మీకేల? తల్లిదండ్రులులేని, దిక్కుమాలిన యీయాదవబాలిక నెందుకు తిరిగి, దుఃఖపెట్టెదరు!
[విచారము నభినయించుచు]

బత్తి— [తనలో] నేననుకొనినట్లీమే, యాచకబాలికగాదు, ... లక్షణములను బట్టి, యున్నత వంశసంజాత యట్లే యగుపించెను... నాయనంబేలనో సంక్షోభ పడుచున్నది. [ప్రకాశముగా] అమ్మా! యూరడిల్లుము! అనాథ నాగుండగు, నాభగవంతుడెల్లరకు దిక్కైయుండ, తల్లీ! విచారించెదవేమి! ఊరడిల్లుము. ఈప్రకృతికి, వెన్నెల కొన్ని నాళ్లును, చీకటి కొన్ని నాళ్లును సహజమ్ములు కదా! నీయట్టి సుశీల లగు బాలికలిటు విచారముల నెమ్మది నుఁపరాదు; నాహృదయ శల్యమై బాధించు నాసంశయమ్మును దీర్పుము తల్లీ!

పాప— పుణ్య పురుషుగాఁ గన్పట్టు మీకుఁ బ్రత్యుత్తర మీకుంట యుక్తంబు కాదు... నీ యభాగ్యుల మన్నింపుడు;

గీ॥ తండ్రి, పెద్దిరాజు, పవిత్ర తాను తల్లి
కయగు, పెద్దమాంబిక, మమ్ము గన్నతల్లి,
వాలకేతు ప్రాణానిల వ్యాళ మనఘు
డన్న, కాటమరాజు, పే ర్గన్నవాడు,

యెలమంచిలి ప్రభువులై మహా వైభవమునఁ బరిపాలనఁజేసి, సంతానాపేక్షచేఁ గళ్యాణమ్మున కలుదెంచి, పరమేశ్వరు కరుణచే మమ్ముంగాంచి! పరలోక గతులైరి [దుఃఖము నభినయించును]

బత్తి— [కాశీ కావడి, దింపి, దుఃఖోద్రేకమ్మున] హా! తండ్రీ! హా! నిజ భుజవిజిత సర్వశాత్రవా! హా! యెలమంచిలి, రాజ్యలక్ష్మీధవా! హా! జనకా!

ఉ॥ తమ్ములఁ దత్ప్రజానవళులఁ గద్దయు ధర్మహితైక బుద్ధి నే
మమ్మున దన్పుచుం సురభిమాడ్కి. నిరంతరముం యథేచ్ఛ సౌ
ఖ్యమ్ముగ, నుంట్రిరీ రనుచు నారయ వచ్చుచునున్న నాయభా
గ్యమ్మున నిట్టివార్తవిన నాయెను! నాయన! యేమి పాపమో!

కాశీతీర్థమ్మున, రామేశ్వరు నభిషేకించి చిరకాలంబునఁ జూచిన, గురుజనుల దర్శింపఁ గుతూహలపడుచున్న నన్ను నీ మార్గమధ్యంబున, నీదురంత దుస్సహ దుఃఖసముద్రంబున ముంచివైచితివా? తండ్రీ! యేమి యీవిపరీతము తాత చనిపోయిన తరువాత!

ఉ॥ దిక్కరియున్న నీ ప్రజల దిక్కరివోలె భరింతు నీవటం
చక్కఱమీర వేడి, కను లన్నియు నీపయినుంచి చూచుచా

రక్కటా నీ ప్రజావళులు, । హా! యిపుడీ యసుఖంబు పించు నిం
కెక్కటా రక్షిం దరింపగల । రీ దరిలేని విచారవారధిన్

[పాపమాంబను సమీపించి] సోదరీ ! మీ కేదిక్కుమాలినవారు కారు!... సత్పురుషులైన, వారులేకపోవుటచేత నీ లోకమే, దిక్కుమాలినదైనది తల్లీ! నేను బత్తిరన్నను...సమాన దుఃఖభాజనులమగు మనల నెవ్వరూ ఆడింతురు ... ఊరడిల్లుము...సోదరీ ! ఊరడిల్లుము.

సీ॥ యదుకుల క్షత్రియులకిలఁ । గదన భూమి
మృత్యుముఖమని, వణ్ణింత్రు । ప్రత్యహంబు
జనకు, డరిబలధ్వాంత భా । స్కరుడ దెట్టు
లస్తమించె ? ప్రజామోద । మస్తమింప

పాప—అన్నయ్యా ! ఆగ్లపెంటపురాధీశ్వరుండగు వాలకేతు రాజు కళ్యాణదుర్గమును ముట్టడించె అందుపై, తన మిత్రసహాయ్యంబునకై సర్వసేనాధిపత్యమును, స్వీకరించి, యుద్ధరంగమ్మునకుంజనియె, అచ్చట నాయనగారి యద్వితీయపరాక్రమమున కాగలేక, ప్రచ్ఛన్నుడై వాలకేతుండు, మన తండ్రినిమడియించె, అవ్వార్త అన్న, కాటమరాజువిని, అమ్మయనుజ్ఞంబడసి, యాహతకుని హతమార్చెను. తదనంతరమమ్మయుఁ బూర్వాచారము ననుసరించి, సహగమనంబాచరించినది. అప్పటినుండియుఁ పితృసముండగు, నీ గంగురాజుపాలనంబునఁ బెంపబడుచుంటిమి !

బత్తి—(చింత నభినయింపుచు) హా ! యెంతదైన్యము ?—యెంతదైన్యము ?

సీ॥ యొంటరికా, యాశ్రయంబిచ్చి । యేలినట్టి
యస్మదన్వయ మీకరి । యేల వాళ
పకట ! యిట్టుల దూరలె । నంది పరుల
పెట్టుపోతలలో బడి । యెట్లుగాంచె

సోదరీ ! యాడుదానవగు, నీవేయింతవగచుచుండ, నిరంకుశస్వైరసంచారాభిలాషియగు నన్నయ్యెంత యడలుచున్నాడో కదా ? అమ్మాయీ ! ! యూరడిల్లుము= కాలవ్యత్యాసమ్మున కెవ్వరేమిచేయగలరు ? రమ్ము ! అన్నయ్యను నాకు జూపింపుము పిన్నవాడెట్టులున్నాడో !

పాప—చిత్తము. (ముందు చనుచుండ బత్తిరన్న, కాశీకావడి నెత్తుకొని, వెంట నేగుచు)

అ వ ని క దిం ప బ డు ను.

---

2వ రంగము—(పెద్దమాదేవి యాలయము)

(గంగురాజు, గంగమాంబ, కాటమరాజు, పాపమాంబ, బత్తిరన్న మఱికొందరు, పేరంటాండ్రు నిల్వబడియుందురు.)

బత్తి—(చేతులను మోడ్చి ఆలయాభిముఖుండయి)

చ॥ అతులితమై, యనంతమయి, యనన్యయమై, కడు నద్భుతంబునై
సతత పవిత్రమై, యెసఁగు, సాధ్వి? భవచ్చరితంబువిన్న, మా
బ్రతుకులు ధన్యమయ్యె, యదు వంశము, నేటికి నీకతంబునన్
గతకలుషంబునై, పటిమ గాంచెను, పెంచెను సద్యశంబునన్

కాట—(చేతులను జోడించి భక్తితో)

మ॥ కరియాలాన్వయమందుఁ బుట్టి, బుధకైంకర్యాది సత్పూజలన్
బరిశుద్ధిం గని, పాపపంకిలతతిన్ మాయించి మేలెంచగా
బరదైవాంబవునై ప్రవర్తిలితివ మ్మా! మమ్ము నీ బిడ్డలన్
గరుణన్ నీదు కటాక్ష వీక్షణములన్ గాంచంగదే యిత్తరిన్

గంగు—(చేతులను మోడ్చి భక్తితో)

ఉ॥ తల్లి! పతివ్రతామణివి, ధన్యచరిత్రవు, వీరపత్నులం
దెల్లను, నగ్రగణ్యవు, నహీన కృపామతి భక్తకోటికిన్
గొల్లలుగాఁగ కోరికలఁ గూర్తువు, నేర్తువు దీనరక్ష, నీ
చల్లని, చూపులన్ బరపి, సాకఁగదమ్మ, శ్రితాళి మమ్ములన్

గంగ—(పండ్లు పసుపు పళ్లెరములు, దేవికిముందుగానుంచి చేతులను మోడ్చి)

ఉ॥ నీదయ కల్మిచే మనగ నేర్చితి, మాఱడిలేక, గొడ్డులన్
గోదలఁ బిల్ల జెల్లలనుఁ, గూడి, సుఖంబుగ నింతదాక, నీ
పాదవ కోటి పాలిటికి, సంబవునై, యిలువేల్పువై, విశే
షాదర మొప్ప బ్రోతువు మహా మహిమాన్యవు, తల్లి; నీవిలన్

పాప—(చేతులనుజోడించి భక్తితో)

గీ॥ తల్లి! నీదర్శనమునకై త్వత్పదాబ్జ
సేవకుల మైన, మేము కాంక్షించు చుంటి

మమ్మ? మమ్ముల దయఁ జూడు మమ్మ? కల్ప
కమ్మ వమ్మ? యాశ్రితుల పక్షమున నీవు

బత్తి—తల్లీ! పెద్దమాంబా మహాదేవి! అపరమహేశ్వరీ!

మ॥ అనసూయాది, పతివ్రతా మణులు మున్నార్యావనిం బుట్టి, పా
వన మైనట్టి ప్రతిష్ట నాటి చనిరంబా; అంతియేకాని, మిం
చినప్రేమన్ గనుగొంచు, నాశ్రితులకున్ జేదోడు, వాదోడుగా
పనులన్ గొంచు, నభీప్సితంబు లిడుమన్ భాషించిరే! నీవలెన్

తల్లి దండ్రులగుమీచే నిష్కారుణముగా, విడచిపెట్టబడిన మాకు.........
కర్తవ్యతా మూఢులమగు మాకు...తల్లీ! కర్తవ్య ముపదేశింపుము. భవద్దివ్య
స్వరూప సందర్శనంబున ధన్యులనుజేయుము...తల్లీ? [సాష్టాంగపడుచున్నాడు.]

[పెద్దమాదేవి ప్రత్యక్షమగుచున్నది]

ఉ॥ వర్ధిలుడయ్య; యాదవ సువంశ సముద్భవులార! సర్వకా
మ్యార్థ ఫలాప్తి నీ దశదిశావని, నేలుచు నూఱువత్సరాల్
సార్థకజన్ములై యశముఁ జాలగడించి పరంపరాభి సం
వర్ధితమైన, బంధుజన పాళి భజింపఁగ గారవాబునన్

బిడ్డా? బత్తిరన్న? ధర్మపథానువర్తివగునీకు శుభంబగు గాక!

బత్తి—తల్లీ? ధన్యులము, ధన్యులము నీదర్శన, సౌభాగ్యంబున, మాజన్మములు ధన్య ములైనవి.

పెద్దమా—నాయనా? గురుజనంబులు లేరనుచింతను విడువుము, కలకాలము గురుజనంబు లుందురా! కర్తవ్యమ్ముల నుపదేసింతురా! జీవుండేయే కాలంబున కట్టికేతులనను సరింపనగునో, యట్లుసంచరించి, జ్ఞానవైరాగ్యంబులగడింపనగు. ఇంతనుండి మన వంశీయులగు పసిబిడ్డలకెల్లఱకు నుపదేష్టగానుండి కార్యములనునడువుము!

బత్తిరన్న—హతోస్మి, హతోస్మి, (చేతులతో మోమునుగప్పి) సింహాద్రి మొద లగు గురుజనుల యండనుండు నే నెట్టు లుపదేష్టగా నుండగలను, తల్లీ!

పెద్దమా—కుమారా! అదియా సంశయము! వినుము! వారు, వారివారి విధినిర్ణయము చొప్పున, మీపెద్దతండ్రినింబోలి, పరోపకారార్థమై కాయంబులవిడచి, వీరస్వర్గంబులజూఱకొనిరి

బత్తి—[దుఃఖోద్రేకంబున] హా! తండ్రులారా!

[కాటమరాజాదులు దుఃఖము నభినయించుచున్నారు]

బత్తి—(దుఃఖముపశమించుకొనుచు)

సీ॥ పంచాగ్నులనఁ, బ్రబల శక్తి నించి, దేశద్రోహ
భీమాటవుల మంట వెట్టినారు,
పంచభూతములనఁ బఱగి, రాష్ట్రప్రజా
క్షేమ సంపదల వీక్షించినారు,
పంచ ప్రాణమ్ముల పగిది సమోన్నతులఁ గో
మించిన మైత్రిని మెలఁగినారు,
పంచేంద్రియముల కైవడి పుత్రకాయంబు
మెలకువనమై పెంపఁ గలిగినారు,
గీ॥ పుణ్యమతులు, యశోధనుల్ బుద్ధికుశలు
లట్టి మిము నెట్టు లపమృత్యు వంటఁగలిగె,
నేమిగతిఁ జూపి, చనినార లీయనుంగు
బిడ్డలకు, వీరలో, నన్నుఁ బెద్దఁ జేసి,

పుత్రవత్సలులగు, మీ ప్రేమబంధముల నెట్లు త్రెంపివైచితిరి? మీ యీ చిన్న బిడ్డలను మీ రంపలొక్కమాలుగా మఱపింపం జూచిన నెట్లు, హా! మందభాగ్యులము.

చ॥ ఒకక్షణమేని, నేమఱక, నొక్కఱుదింపిన, నొక్క పుత్రి మ
చ్చికమెయిఁ, బెంచి, బుద్ధులను జెప్పియు, నింతటివారి జేసి, "నే
తికగును లీకుమారులికఁ దీఱను కష్టములం"చు ముచ్చటిం
చుకొనెడు వేళఁ, ధాత్రులకు, సుంతయు సేవ నొనర్ప లేముగా!

పితృద్రోహులమగు మాకిక నిష్కృతిలేదు... లేదు... యెంతమాత్రములేదు

[దుఃఖమునభినయించును]

పెద్ద—రామనా! యేమది! సర్వసంగ పరిత్యాగివగు నీవేయిట్లు దుఃఖించిన, నీయీ చిన్నతమ్ముల నెట్లూఱడింతువు ... సుజ్ఞానివగు నిన్నెట్టు లీయజ్ఞానమంటగలిగినది లెమ్ము ధైర్యమవలంభింపుము, ముందుకర్తవ్యమ్ములంజూడుము......

బత్తి—ఇంకేటికర్తవ్యము...ఇంక నేమి బ్రతుకు...తల్లీ! ...అనాథవై యాతల్లులా పిల్లలు, గిఱ్ఱుమాలిన పిట్టలట్లే నెట్టుచేమంబట్టిరో!

పెద్ద—కుమారా! భగవంతుని యనుగ్రహమున నట్లు జఱుగలేదు. మీ పెద్దతండ్రులట్లు జనిన యనంతరము, తత్సతీమణులును, పూర్వాచారము ననుసరించి, సహగమనంబాచరించిరి, మీ తల్లి సిరిదేవి మాత్రము, భర్తయాజ్ఞాబద్ధయై అయితమ ముమ్మరాజాది కుమారులతో ధనకొండం జేరి, పట్టభద్రమైయున్నది. నీవిప్పుడు నీతమ్ముఁడీ కాటమరాజును, సహోదరియగు, నీపాపమాంబను, గొనిపోయి, పట్టభద్రయగు, సిరిదేవి కప్పగించి, నామాటగా

గీ॥ కొమరుల, వినిరర్గళ, పరాక్రమ, భుజాగ్ర
దుర్గములయందు, శాత్రవ దుర్నిరీక్ష్య
మాణ తేజోవిరాజితమై నెసఁగుచు
కొనుము, నీయాజ్ఞనిల, నిరంకుశముగాఁగ'

నాశీర్వదించితినని వచింపుము. (కాటమరాజు నుద్దేశించి) నాయనా! కాటమరాజా! నీవొక్కసారిటు రమ్ము.

కాట—(చెంతకఱుగుచున్నాడు) తల్లీ! యేమియాజ్ఞ?

పెద్ద—తండ్రీ! మున్నువచించిన, గోసంరక్షణ పుణ్యఫలంబును మనంబున మఱువక (కిరీటముచే, కాటమరాజునలంకరించుచు) నియ్యది, దీక్షాలక్ష్యంబుగానుంచుకొని;

గీ॥ సర్వ ధర్మాశ్రయమ్మగు, సత్యసూక్తిఁ,
జెలఁగి, గోక్షేత్ర పట్టాభిషేకమూని,
యస్ఖలితమైన, బ్రహ్మచర్యవ్రతంబు
నడుపుమా జన్మ, జన్మధన్యంబు నొందఁ.

ఇయ్యది భగవత్సంకల్పము...

కాట—(వినమ్రుండై) తల్లీ! ధన్యుండను...ధన్యుండను... భగవదాజ్ఞానిబద్ధుండను...
[సాష్టాంగ నమస్కృతులాచరించుచున్నాడు]

బత్తిరన్న—[విచారముతో స్వగతము] తల్లీ! కన్నకుమారుని, నాజన్మబ్రహ్మచర్యంబున, శాసించితివా? యేమి! యీ విపరీతము. [సమర్థించుకొని] దీననే లోకోపకారము ఘటిల్లునో! "దైవమేమిచేసిన తన మంచికే" యందురు.

పెద్దమా—[బత్తిరన్న నుద్దేశించి] నాయనా! బత్తిరన్నా! నీవు రామేశ్వరాభిషేకానంతరము తిరిగి వారణాశి కఱిగి, యవధూతాశ్రమస్వీకృతినంది, జంగమ శిష్యులంగూడి వచ్చి శ్రీశైలమున వసింపుము

బత్తిరన్న—[వినమ్రుఁడై] భగవదాజ్ఞలనుల్లంఘ్యములు...తల్లీ! ధన్యుడను, ధన్యుడను.
(సాష్టాంగ నమస్కృతు లాచరించుచున్నాడు.)

పెద్దమా—(గంగురాజ గంగిమాంబల నుద్దేశించి) ఓకళ్యాణపురీ రాజ దంపతులారా!

గీ॥ కులప్రవర్ధనులైన, సత్పుత్రులను గాంచి
యాదవులు, మీరును, పరంపరానుగత, ప
రస్పరానురాగమున, గరిమ్ము మెలఁగి,
సదమల యశోప్తిఁ దేజరిల్లెదరు గాక.

గంగురాజు
గంగమాంబ } [వినమ్రులై] తల్లీ! కృతార్థులము. [సాష్టాంగ నమస్కృతు లాచరింతురు]

గంగు—[చేతులుజోడించి] తల్లీ? నీదయా విశేషమున మఱియు నిట్లు గాత!

గీ॥ వినయ విద్యా వివేకముల్ ధరను కనక సు
వస్తు వాహనానేక సమృద్ధిఁ పాడి పంట
లలవడఁగ, నిత్య కళ్యాణములఁ జెలంగి
యదువులు పురోభివృద్ధినందెదరు గాత.

దేవి—తథాస్తు.

పుష్పవృష్టి కురియును.

మంగళము

ఇది

శ్రీ సీతానగరాంజనేయ కరుణా కటాక్ష ప్రలబ్ధ కవితా
శిల్పప్రవీణ, పట్నాలవంశోద్భవ అన్నపూర్ణా
చిదంబరాచార్య జ్యేష్ఠ తనూభవ
సుబ్బరాయ నామధేయ
ప్రణీతంబైన
" కాటమరాజు "
అను
దృశ్యకావ్యంబు నందు,
సప్తమాంకము.
సర్వము—సంపూర్ణము

—:o:—

శ్రీ

# శుద్ధపత్రిక.

| పే. | పం. | త | ఒ |
|---|---|---|---|
| 4 | 27 | ప్రాణేశ్వరీ | ప్రాణేశ్వరీ ! |
| 7 | 5 | కకరణుడు | కరణుడు |
| 9 | 9 | శాశ్వితము | శాశ్వతము |
| 11 | 26 | ఆలోనదగా | ఆలోచనగా |
| 12 | 1 | సమిష్ఠి | సమష్ఠి |
| 12 | 14 | కవిలావుల | కవులావుల |
| 13 | 7 | పెట్టి | పెట్టె |
| ,, | 12 | నద్దేశించి | నుద్దేశించి |
| ,, | 13 | యిలవేల్పు | యిలువేల్పు |
| ,, | 16 | సమిష్ఠి | సమష్ఠి |
| ,, | ,, | విచ్ఛన్న | విచ్ఛిన్న |
| 16 | 8 | గౌరముగా | గౌరవముగా |
| ,, | 8 | కరుణాలు | కరణు |
| ,, | 9 | మహాస్సాక్షి | మనస్సాక్షి |
| 20 | 11 | మతిపింపు | ముతిపింపు |
| 21 | 8 | పాక్భవ | ప్రాగ్భవ |
| 21 | 19 | సర్వ్య | సర్వ |
| 21 | 28 | తురుష్కు | తురుష్క |
| 38 | 25 | స్నువాది | స్నువరాది |
| 39 | 8 | మీరు | నీవు |
| 45 | 18 | మన్నుము | మన్పుము |
| 49 | 12 | విగక్త్న | వికర్త్న |
| 50 | 9 | యాఋల | పశుల |
| 54 | 8 | భాత్ప | భ్రాత్ప |
| 58 | 9 | ముష్కరు | ముష్కరు |
| ,, | 14 | వారివీరికి | వారికి వీరికి |
| 66 | 24 | జ్జనదకుజ | జ్జనకుజ |
| 67 | 8 | ఆశిర్వదృ | ఆశీర్వాద |
| ,, | 17 | అతః | అథః |
| 70 | 15 | జవ్వ | జీవః |
| 73 | 9 | వింటిరే | వింటివే |
| 76 | 14 | నిత్యానంక | నిత్యానంద |
| 89 | 5 | శాశ్వితము | శాశ్వతము |
| 92 | 13 | పవిత్రాంశ | పవిత్రాశయ |
| 95 | 17 | యాలరు | యాలము |
| 96 | 1 | లక్షణా | లక్ష్మణా |
| 101 | 27 | అనాథవై | అనాథరై |
| ,, | 28 | చేమం | చేమలం |
| 102 | 9 | వై, నీయిం | వై, నయిం |

☞ విస్తర భీతిచే విడబెట్టబడిన థ, ధ, ఊ, ర, ల, విపర్యయములను చదువరులు మన్నింతురుగాక

గ్రంథకర్త.

వలయువారు:—

☞ పైల లింగయ్యగారు

స్కూలు మాష్టరు, పినపాడు.

తెనాలి తాలూకా, మోర్సుపేట పోష్టు,

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA105B105 |
| పుస్తకం పేరు | ఉదయపు రాగాలు |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 117 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C, |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | pragathi |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | K Daveed |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | NO |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |